279

# వివిధకుసుమావళి

ప్రథమగుచ్ఛము.

(కవి)

కవికొండల వేంకటరావు. బి. ఎ., బి. ఎల్.

శ్రీరంగపట్టణము.




ప్రకాశకుఁడు :—

గాడిచర్ల రామమూర్తి, రాజమహేంద్రవరము.

648
8019

మొదటికూర్పు.

రాజమహేంద్రవరము.

శ్రీమనోరమా ముద్రాక్షరశాలయందు ముద్రితము.

1916

సర్వస్వామ్యసంకలితము.

వెల:-చందాదారులకు 0—8—0. ఇతరులకు 0—12—0

# భావానుక్రమము

# వివిధకుసుమావళి

——:o:——

## I నిశ్శబ్దగీతిక.






——:(o):——

ఉ. ఊడుపుమళ్ళనుండి తడియూటలు బిల్బల సడ్డుచెక్కలన్
వీడక జాలువాఱ దరిఁ బెంపగుపచ్చిక కప్పిపుచ్చుటన్
వేడుకమైఁ గనుంగొనుచు విశ్రమ మందితి; నేమిముచ్చటో
యాడెడుసద్ది కాఁపు తెలియఁగ వలనీని రహస్యవైఖరిన్. 1

ఆ॥వె. శిశువుముద్దుమాట శిక్షింప వచ్చుఁబో
పొదలుదా నిపలుక బోధితంబు;
కన్నెకలుకునుడులు కామింపఁ జెలఁగుఁబో
పొదలుదానిపలుక మోహితంబు. 2

శా. ఆసక్తిన్ వినుకొద్ది నుండియును లేనట్లాచు నిశ్శబ్ద భా
షాసారస్వతమందు నైక్యమగు చాయవ్యక్తశబ్దంబు స
న్న్యాసన్ దవ్వులఁజూడఁ జేసెనొకచో నాకూఁత్చ కేదారమున్
హాసప్రోద్భలులై శ్రమంపడు మతంగస్త్రీలధమ్మిల్లముల్. 3

కం. ఉన్నట్టుండియు వారలు
సన్నగఁ దమగొంతు లెత్తి సాగించిరిగా

పున్నెపుఁ బురాణపదమును
వన్నెలవిటకానిపాట వచ్చిన వెల్లన్! 4

కం. కాలము వేగిరపడియెన్;
చేలికఁ గనిపించెఁ జేయఁ దీఱనిశ్రమముల్;
లీలగ రోదసి యయ్యెడ
వాలాయము వారిపాటఁ బాడఁకు తోఁచెన్ 5

కం. పాటకుఁ గూలీయరు; తమ
పాటున కిచ్చెదరుకాని పాడెద రేమీ?
గాటపుఁబ్రబోధమిదు చా
బోటులకది యొక్క సహజభాషణ మేమో! 6

తే. సత్యమా నది! యదియుఁ దజ్జలముభాతి
నిత్యనిశ్శబ్దతనుగూడి నెగడఁ దొడఁగె;
నేర్తునే యెన్నఁడేనిఁ దన్నిజవిధాన
నాడు గీతిక నిశ్శబ్దమోడికాఁగ! 7

---

## II వృద్ధదాసి

—:o:—

ఉ. ఇంటిపసారపంచ నను పెచ్చినతోటను బెద్దవాయఁ బై
కంటను బోసికొం చులవ లల్లనరుబ్బుచుఁ జుట్టుఁద్రోయుచున్

మంటికినెత్తుగా నిటుకిమర్చుచు నుండినవృద్ధదాసి తా
నొంటిగ నాత్మలోనెదియొ యోజఁగుమారిలు చుంటఁ
[గాంచుచున్. 1

మ. ముసలీ! రుబ్బగ జబ్బసత్తువ చనో ముప్పూటయన్నంబునున్
పసిగాఁబెట్టుట మానిరో? యటులవిస్తారంబుగా బాష్పముల్
వెస రాలంగను నేడ్చెదేటికి" యనన్ వేవేగమీఁజేతఁగన్
గొసలన్ ద్రోముచు నూర్పుఁబుచ్చి పనిచేకొంచిట్లు మా
[టాడెదున్. 2.

ఉ. "నాన్నయగారు! ఏటికివినంగను నాదగుచిత్రగాథ? యెం
డున్నది తీర్పలేరుకద; యుత్తము లెక్కడొ కానియుండ రా
పన్నులపాట్లు లెక్కఁగొనఁ; బ్రాతదియమ్మెను గష్టజీవనం
బెన్నఁగ నాకు, నింకను నిసీ! యనిపించఁగ నేల నోటితోన్? 3

కం. కానీ, యడిగినవారలు
కానన్ నోడువంగనగునుఁ గలిమిని గొన్నా
ళ్లైన యనంతర మకటా!
ప్రాణంబుల లేమిసీడ్వ భారముకాదే? 4

ఉత్పలమాలిక.

పుట్టినదానదూరుపునఁబున్నెములచ్చియుఁ దూగునయ్యకున్
బట్టిని నై; పెఱిఁగితిని నట్టిలుఁ బాయముమీఁఱ; వస్తువుల్
పెట్టుక పెండ్లియాడితిని బేకును మోసినపెద్దకాఁపు; నా

పట్టిననోము లేదుమొనో! భర్త గతించెను గొన్నినాళ్ళకే
కట్టిఁడిముండమోఁత నను గానఁగనోపక నాదుబంధుగుల్
పట్టున నొక్కయావనుని భర్తగఁ జేసిరి వెండి:—వింత క
న్పట్టెడు నేమొ మీకు, నలవైపున మాకొలమున్ మగండు పోఁ
బట్టున నేఁడు మారులు వివాహము కానగునంట:-యంతటన్
బట్టణముల్ విదేశములు పాయక యిర్వురమట్టె మెట్టుచుఁ
గట్టిన యస్సుఁ జేపడెడుఁ గష్టఫలమ్మును గూడ వెట్టుచున్
బొట్టెల నిద్దఱిన్ గనుచుఁ బొందుగఁ గాపుర మొక్క నాల్గునా
ళ్లట్టెటొ పుచ్చఁగల్గితిమి; యిఁకఁ బయిన్ దలక్రిందుగాన శా.
పట్టిన సుంతకల్మిని నభాగ్యత నాపతి త్రాగుడందులన్
దిట్టరిమాయ నాసవతి త్రిప్పుల దీనను దాన నంతయున్
బెట్టె దరిద్రతన్ మిగిలె పేదఱికమ్మున నన్ను రోసి, యా
మట్టునెపోయెఁ; గొంపయును మాన్యము లప్పులపాలు
[సేసె; నా
పొట్టను నేను పోసికొనఁ బోషిడిచెఱ ననుఁ; జిన్నికుఱ్ఱలన్
గట్ట! యటంచు మోసికొని కంఠమునందలి గుల్లగుట్ట నే
గుట్టున దాచుకొన్న యుపకొంచును సమ్మక గౌరవంబునున్
గుట్టునఁబెట్టి చాలవఱకుఁ జఱిగించితిఁ; బెద్దవాఁడు న
ట్టిట్టుఁ బొలంబు కూలిపని కేగుచుఁ దేఁగలవాఁడు కాఁగ గఱ
గుట్టెనొ పాడుదైవమునకుఁ బడె నల్లవిశూచి, వానినిన్

బొట్టను వెట్టుకొంటేఁ దలపోసినఁ జెట్టువలెన్ గనన్ బడున్
బుట్టినదాది రోగ మొకప్రాట యెఱుంగఁడు కన్నతండ్రి నా
పుట్టుక చేటికింక — నటుపోయినఁ జావక చిన్నివానినిన్
బెట్టకయుంటేఁ దెచ్చుకొన వేఱొక సాధన మేమి లేమి నేఁ
డిట్టుల మీకు దాసినయితిన్ — గల యన్నిదినాలు శక్తిమై
గట్టున దాటగన్ దగదె? కాని కటా! యదియున్ జరాప్తిచే
మట్టుపడే విధమ్ముగను మానసమున్ వెఱపించుచుండె; నీ
ర్వట్టినయుల్వ లే నలుగుపాటవమున్ గనఁజాలకుంటి నిం
కెట్టి యవస్థ పట్టనోకో? యెత్తగ సేయనె బిచ్చమున్న నం
చుట్టిని నాగుళ్లాడుచును నాఱికె యొడ్చితిఁ గారణాంతరం
బెట్టెది లేదు లోపమున కేయిడువారలు మీర లన్నియున్"

కం. అనుచున్ జెప్పెడు లోపలఁ
బని యమ్మేను నదియునంత బాబయగారూ!
చనెద నటంచును బోయెను
గనుజూపుల జాలి వెల్లి గావెనుఁబఱగన్ 6

## III చంద్రగిరి.

—:o:—

సీ. ఓమహాభవనమా! యే మహీశ్వరుఁడు నీ
కొలువుకూటాన రంజిలిన వాఁడో;

కోలఁకుఁదామరలార ! చెలఁగు మీ పయ్యెర
నే పట్టమహిషి కీర్తించినదియొ;
కొండబురుజులార ! కుశలత మీనుండి
యేసేన శత్రు వంచించినదియొ;
ఓదుర్గవప్రమా ! నీదు రక్షణమున
నే ప్రజ స్వస్థత నెనఁగినదియొ;
గీ. అట్టి వారెల్ల కాలాన మట్టు పడఁగ
మోడువడు మాకుఁ కారాకు జాడలట్లు
నేటికిని మీరు మిగిలి ర వ్వీటిపేరు
చంద్రగిరి పరపుర మని స్మరణ సేయ. 1

మ. అకటా! లోతగుకందకంబెపుడు బై లై పోవు, నెత్తైన గో
డో కచోనేలకుమట్టమయ్యె, ఘనహర్మ్యోత్తుంగసమామార్గగా
మికి మెట్టయ్యెను, సత్కవీంద్ర నుత సమృద్ధంపుఁబద్మాకరం
బు; కటా! వ్యాఘ్రమృగాలఘాతుకరుతిన్ బ్రమోయుఁగదా
[సర్వదా! 2

మ. బలమొల్లన్ హనుమంత విగ్రహతతిన్ బల్కంగ, సత్కీర్తి ని
శ్చలపుంజమ్మును "నక్క" దేవతలఁ బ్రస్తావింప రాజ్యంపు ది
క్కులు తుంగాద్రిశిఖాగ్రమున్ బొగడ, మాకున్ దోచుఁ గా
[కున్న నో
స్థలరాజమ్మ ! భవచ్చరిత్రమును గా సంతైన నూహిం
[తుమే, ?

శా. అచ్ఛోటన్ విరమింతు నొక్క త్రుటి హృద్యంబౌనొ యే [మైన; నె
మ్మచ్చున్ జూడ నశింపె కానఁబడు నమ్మక్కా! యిటన్ [దక్కఁ, దా
విచ్చెన్ గొండొక తమ్మి మొగ్గ కొలనున్; ఏచున్ దరిన్ బైరుగా
లచ్ఛంపుం బెనుగీడ నొరగిలుఁ బార్శ్వాధార భూభృచ్ఛి [లల్. 4

సీ. మురియంపు ధవళిమద్యుతి తులకించిన
మా రాజు కీర్తి యీ తీరుఁ గలఁగె,
కనుఁజూపు నసమమై యొనసిన మా రాజు
నేకఖండం బెల్ల నిట్లు పిగిలె,
స్వాతంత్ర్యఫలరాజిఁ బఱగిన మా రాజు
కా పెల్ల నీతీరు రూపడంగె
లక్షకు లక్షలై రాగిల్లు మా రాజు.
భోగలక్ష్మి యిటులపూర్వ మరసె
గీ. ననఁగఁ దామరాకులనీరు తొణకులాడు
కొండరాల్ వానపాయుల కోతలువడు
నఖిల వృక్షాళి చెడడు ననన్యమైన
నళిని తూరుపుఁ బేరొక్కనుఁ దలఁప నిందు. 5
తే. భూత కాలాంధకారంపు జ్యోతి యగుచు
వెలయు నిచ్ఛోట శేషించు కలిమి యొక్కఁడె

మిత్ర శీతాంశు మేఘ సుక్షేత్ర గణము
పంటపరిపాలనము లేనిపట్ల వ్యర్థలో! 6

శా. కన్నీరై ప్రవహించు నీకనుమ మేఘంబొండు వర్షించుచో,
నన్నా! రా ననుకంపయెత్తునిటఁజావుల్ ప్రొద్దుసాపంగ, రేఁ
జెన్నో వెన్నెలకాయనియ్యటవిలోఁజింతించుచుఁ, బత్నిపతుల్
మన్నింపంగను లేరుగాయనుచు నీమన్నఁబు జీర్ణించెడుఁగా.

---

# IV వియోగము.

—:o:—

తే. ఏపు చూపెడుపచ్చిక యిక్కలందు
గోవులను మేపుకొనుచును గొంత సేపు,
దట్టమగు చిగురుటాకుల రొట్టఁ గోసి
కోఁడెదూడల కిడుచును గొంత సేపు. 1

ఉ. కాలము వెళ్లబుచ్చినను గన్పడుచున్నది యింక నెంతయో
కాలము దానినిం గడపఁగా నెఱిఁగింపుమి యెవ్విధాన? నీ
లీలలఁగాక వచ్చిన చెలీ! దయసేయుము రమ్ము నాకు నే
వేళను గూర్చుచుండు తమి వేడ్కల నీ చెలువంపు చెయ్వులన్.

చ. నెల వెనుకొక్కనాఁడు రమణీయపుఁబిల్లనఁగ్రోవి మ్రోతలన్
గలచు విచారముల్ పొడమఁగన్ నినుఁగోరికఁదీసికొంచు ని

ర్మలసలిలమ్ముగోరులు చనుమావిరసమ్ములఁ జూఱలాడుచుఁ
మసలితిఁగాదె యెంతయును మానిని నీకదిజ్ఞప్తియుండదో?

సీ. ఉరుశిలోపరి భూషితోర్వీధరాగ్రంబు
లెల్లనంజలఁ గొసరించుచోట
తొగలమొత్తమ్ములఁ దులఁదూఁగు కొలఁకులు
శీతచంద్రికల లాలించు చోట
పెనఁగి వృక్షమ్ములవెల్లాడుఁలతలు ద
క్షిణగంధవహుని నూగించు చోట,
మాలతీచంపకమల్లికాతతి పిసా
ళించుపూవుల నిరీక్షించు చోట
భృంగశారికపికకీరబృంద మెల్ల
కెరలిదిగ్దంతములను మ్రోగించు చోట
చెందువలెఁదూలి చెలరేఁగు చిట్టిజింక
యిచ్చఁగొఱుకుఁ బచ్చిక నవరించు చోట 4

తే. వేణునాదంపుఁ బలుచని తేనె లందు
సరస సల్లాప శర్కర శల్కలములు
మొదపి తీయముల్ కూర్చితిమే కరంబు
నంటి తిరిగెడు మధుపంపుజంట వోలె, 5

చ. విడిచితినిన్ను; నే విరహవేదనఁ బొల్పడి యుంటి నిన్నెడఁ
దడబడుచుండుడొంకెనల దాసిలతల్ విఱువంగఁబోవుచోః

గుడుపఁగఁజాల లేఁగలను గోవులకున్ సరికాఁగవిప్పుచున్
నడుపఁగనేర బీళ్లకు ఘనమ్ముగ దూరమటంచుఁదోఁచెడున్

సీ. మెలఁత ! నీచిరునవ్వుఁ దలఁచు కొలందిని
జాబిల్లిడాలు సంజ్వరము గొలుపు
సకియ ! నీకెమ్మోవి చవులనెంచు కొలంది
ఫలము లొక్కొకటి చప్పనగఁ దోఁచు
ముదిత ! నీనునుదేహమును స్మరించు కొలంది
తలిరులపానుపు ములుకు నయెడు
వనిత ! నీపలుకులు గణియించు కొలఁదిని
పక్షులరుతములు పాఁతగిలెడు,
నెలఁత ! నీతోడఁ గడపిన నెలను నెంచ
నీ దినాంతము లెల్లను వృథగఁ జెల్లు.
తెఱవ ! నీకూటమిని నొప్పు తీరుఁ జూడ
నొంటరిగ నిప్పు డేనిటనుంటఁ గలఁచు. 7

చ. పిదుకుదు నేను పాలు మఱివెన్నను మిూఁగడ నీవుతీయుచో
నుదయమె నేను దిమ్మఱుఁపు నొప్పగ మంతను నీవు
[మోయుచో
నుదకము నేను తెచ్చెదను నుష్ణ మొనర్చుచు నీవు పోయుచో
నుదవతి!దంపతుల్ పనిసమంబుగఁబంచుకొనంగనయ్యెడున్.

ఉ. గోపకుమారు వెంబడిని గొండపొలమ్ముల గోలమందలన్

మేపుచుఁగాలముఁగడపమే లెయటంచుఁదలంపఁబోకుమా
శ్రీపతియంతవాఁడయినఁ జెందఁగనేరఁడు మత్ప్రమోద
[మున్
జూపఁగలేఁడు బ్రహ్మయిన సుందరినావలె లోకచోద్యముల్

చ. చిగురులసెజ్జనై చెద విచిత్రపుఁ బూవులమాలలన్ మెయిన్
నగలుగనుంతు గ్రోవిని ననారతమూదుచు విందుఁ గూర్తునె
వ్వగలనుదీర్తుఁ దీయనగుపండ్లను జల్లని నీర మిచ్చెదన్
సొగసుగఁ జూపుచుండెదను జుక్కల మబ్బుల సూర్య
[చంద్రులన్ 10

తే. రమ్మ వేగమ్మ వచ్చి, సౌఖ్యమ్ము లిమ్ము
నీవు రాకుండు వేని యోపూవుఁబోణి.
యాలకదుపుల విడిచి యివ్వేళ నేను
పయనమగుచును నిఁక జేర వలసియుండు. 11

---

# V ఆర్యాంగనాస్వప్నము.

కం. వేసవి నొక దివసంబున
గాసిలి సాయంతనమునఁ గడుబడలికతోఁ
బూసెజ్జ నొడలు వాలిచి
యేసుఖమును గరము నిచ్ఛగించుచు నుండన్. 1

సీ. నెమ్మేనఁగమ్మిన చెమ్మట లాఱిచి
మందమారుతము లానంద మొసఁగ
నవయువతతి పడ్డ యలయికఁ దీఱిచి
మృదువైనపానుపు ముదముఁ గూర్పఁ
బవలెల్లఁ జెందిన వడకొట్టు నడఁగించి
సాంద్రచంద్రిక కడు సౌఖ్యమిడఁగ
వ్యాపారమునఁగన్న వైకల్యమును మాన్పి
ధ్వనివిహీనస్థితి కునుకుఁ దేఁగఁ
గీ. అహహా! కష్టల కేకద సౌఖ్యప్రదంబు
లంతకంతలై తోఁచెడు నంచు నెంతొ
మదినిఁ దలపోసి గాటంపు నిదురఁ జొక్కి
నన్ను నేను మఱచి యప్పుడున్న యెడల. 2
చ. లలితవిచిత్రముల్ గనఁదొడంగితిఁ గన్నులఁ గట్టినట్టులన్
గలయన లేను సత్యమని గట్టిగ నొత్తి వచింప నేర; వేఁ
దలఁపఁగరావు పూర్వముగ దాపఁగఁజాలను నెమ్మనంబునన్
దెలుపుడుఁ గల్లయో నిజమొ ధీనిధులే తెలియంగ నయ్యె
[డున్. 3
ఆ॥వె. సౌధరాజతతులఁ జక్కనిబాటల
సుందరోపవనుల సొబఁగుమీఱి
చక్రవర్తినగరసరణిని బఱఁగుచు
వెలయునొండుపురముఁ దొలుతఁ గంటి 4

కం. ఆపురి చెంగట నొక్కవి
లాపము వినవచ్చె దానిఁ గ్రమమున వినుచున్
"బాపము! కొండొక మానిని
వాపోయెడు ననుచు జాలిపడుచును జేరన్. 5

సీ. అపరంజి పసిఛాయ నపహసించెడు మేన
వల్కలంబులు వింతవన్నె నెరప
శీత్కారము జనించి చెలువెలర్చెడు కర్ణ
ములఁ శిరీషము వింతమురువు జూపఁ
గంబుసౌందర్యంబుఁ గంకించుగళమునఁ
బూలదండలు వింతపోలుపు నిలుప,
నప్సరసాంగన నదలించు మోమున
శాంతభావము వింతకాంతిఁ బూపఁ

గీ. దనరు నిండుచూలాలి నాస్థలమునందుఁ
దనదు కేల్దోయి జోడించి వనటఁ బెక్కి
దృష్టిఁ దేలిచి కంఠంబు నెత్తి యెత్తి
యేడ్చుచుండుటఁ గంటిని నెదుట నిట్లు. 6

ఉ. "ఓయమ! మేనకా! కనుమ యో! భవదీయసుతన్ శకుంతలన్
న్యాయ మొకింతయైన నెదనారయ కా వరపౌరవాన్వయుం
డీయెడ వీడె నన్ను దయనీక్షణసేయఁగదమ్మ వచ్చినన్
దీయఁగదమ్మ నీదరికి నింకెటు పోదును గన్నపాలికిన్"

మ. అలయార్తధ్వని నాలకించుచును నేనందే యటుల్ వింతమై
నిలువన్ ఖేచరమార్గమందుదిగుచున్ నేత్రోత్సవంబై శకుం
తల నత్యంత జవంబునన్ దివికి గంధర్వాంగనారత్న మిం
పలరన్ గొంచుఁ జనంగఁగాంచితిని మాయంబాయె నేమో

తే. ఆప్రదేశముదాటి యింక రుగుచుండఁ [యనన్
దాపసుల కాటపట్టయి తనరఁదగిన
వనము నొకదానిఁగాంచితిఁ గనుఁబండు
వన్యసద్దానిఁ జూచిన యంత నాకు. 9

కం. సమిధలు పర్ణంబులు స
త్సుమములు దర్భలు ఫలములు శుభ్రజలంబుల్
విమల తపోధనులందఁగ
నమితములై వెలయుచుండె నవ్వన మందున్. 10

కం. అందందున్ విహరించుచు
ముందఱ నొకచెట్టుక్రిందఁ బూర్ణశ్రమమున్
జెందిన పతితల తోడస్సైఁ
బొందికనిడుకొంచు విసరు పొలఁతిన్ గంటిన్. 11

మ. ఉపవాసశ్రమమెల్ల నామెవదనాంభోజంబుచూపించె, ధై
ర్యపుఁజిత్తంబును నేత్రముల్ తెలిపె, దూరస్థానమే తెంచి [యాం
ద పతిన్ దద్దయు సేద తేర్చుటలుతన్నారీమణిన్ బోల్చు దూ
రపుఁజూపున్ బొడసూపె నిక్కముసతీరత్నంబనం జెల్లుగా!

చ. అలసతి యెవ్వరో వినఁగ నన్యులు కన్పడరైరి చిత్రమే!
యలఘుచరిత్రధర్మవిదుఁ డంద్రుజనుల్ నినునాదునాథునిన్
దలఁపుమి సత్యవంతునిగ నన్గరుణింపుము ప్రాణదానమున్
సలుపుమటంచు లేచి చనసాగెను దక్షిణదిక్కు చూచుచున్.

తే. దానిఁగని శీలయెవ్వరో ధవునిజీవ
ములను ధర్ముండు పడిఁగొనిపోవుచుండ
ననుసరించుచునుండె నటంచు నెఱుఁగఁ
గల్గితిసిగాని వెన్నంటుగా వశంబె ? 14

కం. మఱికొంతవడికిఁ దిన్నగ
నరుగఁగఁ గట్టెదుట నతిభయంకర మగుచున్
వెఱపున్ గొలిపెడు నొకయెడఁ
గఱకుశ్మశానస్థలముఁ గనుఁగొనినాఁడన్. [నన్

చ. పొగలెగయంగ నంటుకొనఁబోయెడు కాష్ఠములొక్కచోటను
సగము తగుల్పడన్ గొఱనసహ్యపు మొండెము లొక్క [చోటఁబూ
ర్తిగ నశియింపభస్మమయి రేగెడు నెమ్ముకలొక్కచోట నా
కగపడె నచ్చటెల్లెడల నర్ధనిశీధిని భీతి హెచ్చఁగన్.

కం. అచ్చోట కొకసాధ్వీమణి
వచ్చి మృతుండయిన చిన్నిబాలుని మేనన్
జిచ్చుంచఁగఁ గడఁగుచు నె
మ్మచ్చునసంచు వెనుకాడ మఱికనుఁగొంటిన్ 17

ఉ. హా! సుత! లోహితాస్య! యిటులొందుపడుచును నొంచనైతి నే
నేసమయంబునందుఁ దుదకెట్టి యవస్థ ఘటించె ధాత యం
చాసతి యెన్ని యోగతుల నాత్మజరూపవిలాస మెంచుచున్
జేసెను రోదనంబుఁ గడుఁజెప్పఁగజాలను దానినియ్యెడన్
తే. ఇంక నచ్చటేమేమొ నాదృష్టిఁ బడియెఁ
గాని సరిగను స్మరణకుఁ గానరావు
స్వప్నమగుటను నేమొ సర్వంబుఁ దెలియ
నలవికాకుండె నాకిట నక్కటకట,! 19

కం. ఆరుద్రభూమిఁ గడవఁగఁ
జేరితి నేఁ బోయిపోయి చిత్రంపుమహా
ఘోరవనంబున్ వల్లీ
భూరుహతతి కుంజవితతి భూతఘనంబున్. 20

సీ. ఒకసీమ దావాగ్ని సకలంబు కాల్ప వే
ఱొకసీమ మధువు కోరకము తొడఁగు,
ఒకమూల వేటకాండ్రుచ్చులుపన్న వే
ఱొకమూల మృగజాతి యులివుఁ గొలుపు,
ఒకచాయఁ గఠినకంటకములు పిఱుఁగ వే
ఱొకచాయ పూలరాలిక లెసంగు,
ఒకవంకఁ బాము లూరకబుసకొట్ట వే
ఱొకవంక విహగంబు లొనరఁగూయు,

నావనాంతరమందున నట్టి యిక్క
నొక్కయెడ బెదరువడుచు నొక్కయెడల
సంతసించుచు నడకలజాఱి నాఁడఁ
జోద్యములనెల్ల కన్నులఁ జూఱఁగొనుచు 21

చ. అటనడయాడుచుండగనెయంగననొర్తునుగాంచఁగల్గితిన్
బోటుబోటుఁగారునశ్రువులుపోఁదుడువంగఁజెఱంగుఁదీసిఁ హా!
యెటువిడనాడిపోయితి మహీశ! నళా! యిదెరెండుచేసితే?
కట! కట! యిట్లు నన్నుఁ గడగండ్లను ద్రోసితె యంచుఁ
[గుందఁగన్.

ఉ. ఎవ్వతె వీవయో! యిటుల నేటికి నొంటరివైతివిందు? ని
న్నెవ్వరుపీకినారటవి? నెందులదాన వటంచు నెన్నియో
యవ్వనితామతల్లిని రయమ్మున నేనడుగంగనుండినఁ
రివ్వన నాస్థలిన్ వదలి ఱెక్కలతో ననఁబోతి నెట్టులో.

ఉ. ఆపయి సాగికాంచితి మహాబ్ధిని లంక నశోకవృక్షపుం
దాపున రాక్షసాంగనలు తప్పక కావలికాచుచుండ లో
లోపల రామరామ, యనిలోఁగుచునున్న పవిత్రనయ్యో! యే
పాపి తెగించెనొక్కొ.. పరభార్యను దేరనటంచు నెంచితిన్.

కం. అంతటఁ జేరితి రాజస
భాంతరమొకదాని, దాని యతిశయమును నే
వింతగఁగంటిని, నొడువఁగ
నెంతయు రారాజు కూటమే యననొప్పున్. 25

మత్తకోకిల.

వృద్ధపౌరులు రాజబంధులు వేషధారులు మంత్రులున్
యుద్ధశీలురు వీరపుంగవు లుద్ధతుల్ ఘనకాయులున్
శుద్ధవర్తులు తంత్రబుద్ధులు శుక్తయోగులు భోగులుం
దద్ధరాపతి కొల్వునందు ముదంబుగూర్తురు సర్వదా. 26

చ. త్రుటియటనిల్వఁగాంచితిని ధూర్తుఁడుదిట్టతనాన నొక్కఁడ
చ్చట కొకతన్వివేణిఁగొని సభ్యులు చూడఁగ నీడ్చి తెచ్చి, య
క్కట! భువనేశుఁ డెచ్చరికఁగన్గొనఁ జీరలనూడ్వఁబోవు టం
తట నలనారి కృష్ణయని ధ్యానమొనర్చుట భక్తితోడుతన్

చ. అదికని యేమి యాగడమయా! కడనారకఁ జూతురే మహా
విదులరు మీరలంచు నటవెంటనె లేచితి నామొఁగావఁగన్
మది వడి హెచ్చఱింప నయినన్ దెలివొందితి నంతలోనె, నే
నదిగొనరింపకుండఁగ నయారె! కలంచు నెఱుంగఁజాలితిన్

ఉ. చూచితి లేచి స్వప్నమునఁ జూచిన కాంతలు పుణ్యలాటవేఁ
దోఁచెను భారతాదులను దొడ్డమెలంత లటంచు మెచ్చుటా
నౌ! చిరకష్టముల్ పడసి యంతయు నోపికతో సహించువా
రే చిరసౌఖ్యముల్ కుదిరి యెంతయుఁగీర్తివహింతురిమ్మహిన్

# VI సృష్టిసూక్ష్మము

———:(o):———

కం. సారంగధరుని మెట్టనుఁ
జేరెడు దారికినిజనక చేరికఁగల పా
తేరునకున్ దిగుబాటను 1
గోరక యలనడుమ నూఱ్పుకొంద్ర మసలుచున్.

చ. తొలకరి వాననీటఁ దులదూఁగెడు కొండకొలంకు తూమునన్
గళగళ శబ్దగుంఫనమనర్గళమై వినిపింప వీను లిం
దలవడఁ జెంగటన్ నిలిచి యల్లమనోహరసృష్టిబోధ ని
శ్చల వివశాత్మనౌచుఁ గనుఁజూపుల నొక్కక్షణమ్ము
గాంచితిన్ 2

కం. క్రొంజలముల కెంజిగితో
రంజిల్లుచుఁ బిల్లగాలి లాలనములకున్
బింజించెడు నలలెచ్చఁగ
సంజను బొడసూపెఁ గొలను స్తవనీయంబై. 3

మ. దరిపై మొల్కలఁ దేఱుపచ్చిక వినోదంబయ్యె నందంబులన్
శిరముల్ చూపెడుతుమ్మచెట్లమునుకల్ శృంగారమై తోచెనా
మఱుఁగున్ గూండ్లనుడాగి తెక్కవిదలన్ మైవిచ్చుపక్షుల్
[కనన్
గలవయ్యెన్ మిలమిలంబుమీనముల సోగల్ సొంపుపెం
[పాఱెడున్.

తే. అట్టివేళను వినవచ్చె హాస్యరసము
లోలుకుపిలు పొంకు ,,రతనాంగి! యోసి! రావె!’’
,,రావె! చిత్రాంగి! యోసి! యీలాగటంచు’’
వెంటనే నాదుచూడ్కి యావెంటఁదిరుగ. 5

ఉ. ఆపిలుపాలకించుటనె యాత్మగతంబునఁ జెంతమెట్లపై
నోపెడ పల్లెనోస్మృతి మహోత్సవమెచ్చఁగఁదద్వి దేశసం
స్థాపితగాథగానమును జల్లనిగాలికిఁబుచ్చి యెవ్వరో
యాపగిదిన్ బయల్ వలికి నారని యెంచితిఁగానిముందఱన్

ఉ. కంటిని మల్పులోఁ బశులకాపరి నొక్కని తానమాడి వాఁ
డొంటిగ దేహమార్చుకొను చుండియుద్వృష్టినిగిడ్చి బెల్లుగన్
మంటినిదీసి లోవిసరి మళ్లును మళ్లుమికించుఁ బోదమే
యింటికటంచెలుంగునిడు నింపుగ దేనినో నర్మవాక్యమున్

కం. నేనది కనుగొనుచునె యీ
మానిసి కీప్రాంతమందు మక్కువఁదగులన్
మానవతి యెవ్వరైతె యని
యానీటను మంటిసుడుల యంతనెచూడన్ 8

కం. నీడను నికసంతో నొక
తాడిని డాగుండి తలనుదిప్పించుక తా
నేడనుగనఁబడ కీఁతా
లాడెడు నొకమహిషధాము నరసినవాఁడన్ 9

కం. పై నొడకాను సీటను
దా నాపవల్లెనుండి తనివిని గనమిన్
మానిసి సరసపుఁబిలుపా
ప్రాణికి వినఁబడదు చిత్రరత్నాంగనినన్ 10

కం. మఱియొకమా అతఁ డించుక
యరమరలేకల్లనల్లు టందఁపుదుంతఱ
దిరుగవె రత్నాంగీ యనుఁ
దిరుగవె చిత్రాంగి యనుచుఁ దిరుగఁబాడున్ 11

శా. ఆపాటన్ రమణీయదీర్ఘముగ రాగానన్ మదన్ బెంచి సి
గ్గేపాటున్ గనఁబోక పాడెఁ గదరా యెంతైన మోహాసఁ దా
నాపట్టున్ మఱువంగనోపునది పోతైయుంట; నవ్వించదో
దాపున్ గర్ణవినోదినైవినుమమాత్మన్ వింతసంతోషికాన్!

కం. లోకంబున మూర్ఖులరై
మూకులుగానుండు జనుల ముచ్చటఁగొలుపన్
సాకెడు రమ్య రహస్య
శోకస్థలమదియు సృష్టిసూక్ష్మంబారా! 13

—:o:—

# VII చిన్ననిదుర పెద్దనిదుర.

(o)

ఆ. వె. నిదుర రాత్రిపూట నేఁ బోవునప్పుడు
ఘడియ యెంతయగుట గణనసేయఁ
గాలమెల్ల నొక్కలీలగఁ గడచెడు
వత్సరంబు లనక వయసు లనక
వెలుతుఁ జేదియంచుఁ దలపోయ నిసుమంత
కనులు మూయునంత గాఢతమసి
వెలుఁగు చీకటి యను విభజనమే లేక
యొక్క కల సుషుప్తి నొప్పుచుండు
మనుజజంతురాశి మఱచియే పోవుదుఁ
గనుకఁ గనినయంతఁ గూర్చుసఖ్య
మాతఁ డీతఁ డనెడు నంతర మెఱుఁగని
శబ్దరూపరహితశాంతి యొకఁడు
చిన్న యిట్టినిదురె నన్నింత తనియించఁ
బెద్ద నిదుర యెంత పేర్మికలదొ!

---




# VIII న్యాయమె?

—:o:—

ఉ. నల్లనియుక్కుకాయమున నమ్మికఁగట్టిన దండ పిక్క లో
మ్మెల్లయుఁ బిక్కటిల్లఁ దల నెంతొ భరమ్మును మోసి
కొంచు న
ల్లల్లన రాజమార్గపునడన్ నడతెంచెడు కూలివాఁ డొకం
డుల్లము తల్లడంపడఁగ నోపికఁ బర్విడికొంచు నాసతో 1

ఆ॥ వె. నాదుబండికమ్మ సేదతీఱఁగనాని
యెదియొ చెప్పఁబోయి బెదరుపడుచు
వెనుకనడచుచుండె విసువని నడకమై
వచ్చువాని చిన్నె లచ్చుపడఁగ 2

సీ. క్రింద బాటనుజేఁగు కెంధూళిపటలంబు
సీలమండకు నెగజిమ్మ యరిట
ఎగఁగట్టి మొలచుట్టు బిగియించి త్రిప్పిన
గట్టిపుట్టము రొంటి పట్టువదల
ఆయాసమునకోర్చి యడుఁగిడునొడలంట
దట్టఁపుఁజెమ్మటబొట్టు బలియ
తలను బుజమ్మును తడవు తడవు మార్చి
బరువు రెండింటికిఁ బంచిపెట్ట

గీ. తుసుత్తుచేఁ బొట్ట వెన్నంట నుత్తకాళ్ళ
నీడ్చు చుసురంచు నిఁక దూరమెంతో యనుచుఁ
దఱుగ దేనాటి కనుచును మఱల మఱల
నన్నుఁజూచుచు నొక వెడనవ్వు నవ్వు 3

ఉ. ఆతనిఁజూచిచూచి యిఁకనాగక ప్రశ్నముభావవైఖరిన్
"మోతను జాలమోసికొనిమోయఁగనేరని పాటుతోఁప, నీ
రీతిగ నెందునుండి యెటకేగుచునుంటి" వటంటి నన్నలో
నాతురపాటుమీఱ నతఁడాడఁగ సాగెను నేనునూఁకొనన్. 4

మ. చలిగంజిన్ వడిఁద్రాగి వేఁగునవె నే సంసిద్ధునై యల్లలో
పలిమన్నెంబులనుండి వత్తును కనన్ బందుల్ కలారల్ల ద
వ్వుల గోదావరికవ్వలన్ నడచితిన్ బ్రొద్దెల్లమధ్యాహ్నమే
కలియున్ గంజియుఁద్రావ లేదునడకింకన్ దేలదేయెంతకున్

శా, తండ్రీ! పట్టనమింక నెంతదవ్వు? సత్రంబుదుమాపున్న నె
వ్వాండ్రైనన్ బెదరింతురే మొయయినన్ భాగ్యానకేమున్నదా
గుండాగ్రిక్ బలె బాండ్రభూమిమఱుఁగున్ ఘోరాటవిన్
గ్రోల్లులల్
గాండ్రింపున్ జరియించుమన్నెములపక్కన్ నక్కుమా

తే. అని యనెడులోన మాబండి యల్లలేళ్ళ [బొంట్లకున్ 6
పాకలనుదాటి వాని కీవలఁజెలంగు
నేడుమఱ్ఱుల సత్రంబునీడ దరికి
వచ్చినది చూడు మల్లదే పట్నమనఁగ

చ. అదికనునంత నెంతో విసయమ్మున॥ నా మన పోక్క'' టం [చస
మ్మదపు రహస్యపుంబ్రకృతిమన్నన సేయుచు॥ వెఱ్ఱిబాగులన్
సదయతఁజూడు '' డంచును భుజంబున మోపునువిప్పియం [దులన్
బాదివినక్రొత్తపన్నిడని మొండిని ఆకటిముక్కఁదీసి యే
విధమునన్నైనఁ దీసికొని వెళ్లను పాయమునఁజెప్పమంచనన్

కం. ఏటికి? కొంపోమంటిని
చీటికి భయమంచువాఁడు చెప్పఁ దలఁకుచున్
మాటాడక పొమ్మంటిని
వీటికి దాఁ గ్రొత్తయనుచు: వేఁడెనుమిగులన్ 9

ఉ. బండిలో గడ్డి క్రింద యిడి పైనల గుమ్మముదాఁటునంత నే
యింపనితం(డితాడి)! యనియెంతయునన్ బ్రతిమాలుకోఁ [గనా
తుండును దాచిపెట్టి వడిఁ దోలుచు బండిని బోవనిచ్చితిన్
మొండుగ సంతసంపడుచు మేనుజెమర్పుచువాఁడు వెంటరాన్

కం. ఆటంకము లేకుండఁగఁ
జీటికి సామిన్నయకుండఁ జేరితిమి పురిన్
మాటికి దండం బిడుచును
దాటించినయల్లముక్కఁ దగవాఁడుకొనెన్.

చ. కొనుచునతండుఁ "దండ్రి! యటుకూలిని దెచ్చుక యిల్లుకూ
[డునున్
మనియెడు మేము నట్టడవి వాఁకుల గొట్టుక వాడుకొన్న నె
వ్వగివా యటన్న తీరుగను బన్నుల వేయుచు బీదసాద నె
మ్మనమున జంకుఁగొల్పుటలు మంచియె నాయమె" యం
[చు నన్విడెన్.

---

## IX కర్మాశాల

చ. ఇట నిరుడిట్టిసంజల నెయివ్వీధి నొజ్జలతోడఁగూడి ము
చ్చట విహరించి యింటికిని సంతసమొప్పఁ జనంగఁ జాలు నేఁ
గట! యిది యేటికియ్యెడ నకారణచింతన సేయుచుంటి ను
త్కటముగఁ జూడఁజూడ నెదఁదట్టెడు వింతవిచారభార
[ముల్.

సీ. సొగలౌ శ్యామపున్నాగముల్ తెలిపూలు
జల్లవో? యిది యేమి చల్లకేమి!
ఇంపులౌ ఘుమ్మను చంపకమ్ములు తావి
గుప్పవో ? యిది యేమి గుప్పకేమి !
దిటములై పెరిఁగిన వటవృక్షములు చాయఁ
జూపవో? యిది యేమి చూపకేమి !
పూతమై ప్రవహించు గౌతమి తెమ్మెర
వీవదో? యిది యేమి వీవకేమి!

కిచకిచ మటంచు చూరులపిచుక లిప్డు
డెగురవ్వా యిందు? యిదియేమి యెగుర కేమి!
బెదరి బెదరి గోడల మేఁకపిల్ల లిపుడు
రాయవ్వా యిందు? నిదియేమి రాయఁ కేమి! 2

ఉ. ఆడరో? మ్రోలఁబచ్చికబయళ్లను గొందఱుబంతులాటలన్
బాడరో? వెన్క నిర్ఝరిణిపజ్జను గొందఱు పాఠపద్యముల్
కూడరో? గోష్ఠలన్ సభలఁ గొందఱు వాసరచిత్రచర్చలన్
జూడఁగ నద్దియెల్ల తొలిచొప్పునె పోఁజఱుగంగ నయ్యెడున్.

కం. కారా మునుపటియొజ్జలు?
లేరా సంఖ్యను మునుపటిలీలన్ ఛాత్రుల్?
ఈరా మునుపటివిద్యల?
నారయ నదియెల్ల నడచు నప్పటి యట్లే. 4

తే. అయిన నెమ్మనమందున నభినవముగ
నుదయమొందెడు నొకచింత నుండనైతి
నేను కొన్నాళు లింకిందు నేర్వనైతి
నంచునై యుండనోపునో? యదియుఁగాదు. 5

చ. పొదలు కళావిధానముల పొందగు నీవర పాఠశాలలోఁ
జదివినవారు కారె మఱి చాలపరీక్ష కృతార్థులౌచు స
మ్ముదపడువారు కారె యిటుమున్ గలకాలమునుండిపాఠకుల్
మదిఁదలపోసిరే యిటుల మామక మానసమట్లు వింతగన్

కం. ఏమో వారలు నావలెఁ
బ్రేమంబునఁ జింతచేసి వింతగఁదోఁపన్
వేమాఱు తలఁచుకొనుచున్
గామితకారణముఁ దెలియఁగాఁజాలరొకో.

సీ. అరయ నియ్యది మన యర్థపుస్తకమందె
కనిపించు నీగురుల్ వినఁగనేల?
ఊహింప నిది మన కుత్త్వాతయె కాదె
వృథగను నీగురుల్ వినఁగనేల?
భావింపఁ దునకలప్రశ్నంబులే తెల్పు
మునుముందు నీగురుల్ వినఁగనేల ?
తలపోయ నిదియెల్ల తెలుఁగుసంస్కృతముగా
విదితంబె యీగురుల్ వినఁగనేల ?

గీ. అనుచు నెంచుకొనుచు గురుల్ వినుచు దానిఁ
బెడచెవినిబెట్టి కొన్నాళ్ళు కడపితిమిగ
చదివి చదువని చాడ్పున సంతసమున
నొజ్జలును మమ్ము దయఁ జూచు చుండిరి తన.

హాయప్రచారరగడ:—

మఱ్ఱియూడ మంటినాడ
గొఱ్ఱెపిల్ల కొసరిచూడ
భూరుహములు పూలువిడువ

పాఱునదిని బడవ నడప
కూలిపిల్ల కూడు తేఁగ
బాలుఁడొకఁడు బండి లాఁగ
నరసికొనుచు నందుఁబాడఁ
గలచి గంటఁ గడపు వాఁడ.

సీ. అగ్గింపకుందురే న్యాయశాస్త్ర మెఱింగి
తలఁపులఁ జిచ్చులు తగిలియున్న
కొనియాడకుందురే గురువిధానము నేర్చి
కల్లవాండ్రకుఁ జెప్పఁ గూడుచున్న
నతియింపకుందురే జత పరీక్షలుఁ దేఱి
యుద్యోగ పథికార మొప్పియున్న
ః నుతింపకుందురే ఘనశిరుల్ గణియించి
గుణియించుచుండెడు గొప్పనున్న.

గీ. సన్నుతింపరే పట్నవాసంబు నున్న
బొగడకుందురే పల్లెలఁ బొదలుచున్నఁ
గ్రిందఁ బడిడించు విద్యలఁ గెరలి నట్టి
ఛాత్రసత్తములీ కళాశాల నెంచి.

చ. పొడమెడు యౌవనంపు నెఱిపోఁడిమి వాఁడిఁ బుట్టు రత్నమిం
పడర కళాశ్రయుక్తముగ నచ్చుపువిద్యల సానఁ దేఱి మె
ఱ్ఱ్యెడ గుడుపుచ్చు నెత్తుడఁ ఫులీనెడు కాంతిఁ జెలంగినట్టి యా
కడచిననాళ్లఁగోర్కెమెయిఁ గ్రమ్మఱ రమ్మనవచ్చునట్టివే?

# X వారినిపాతము.

——:o:——

మ. తుది నీదర్శనభాగ్య మబ్బెనుగదే! తోరంపుసంతోష మిా
మది రెట్టింపఁగఁ బాపనాశన మహాంభఃపాతమా! నీవు నీ
కదె! చెంతన్ విలసిల్లుచున్ బ్రచురమా యాకాశగంగాం
[బుపెన్
రోదతో మబ్బులుముద్దు వెట్టుకొన నాలోచింపఁ జోద్యంబవే.

ఉత్పలమాలిక.

వారినిపాతమా! యిటులపర్వత రమ్య రహస్య సీమలన్
స్వైరవిహారివై రదనపఙ్క్తియనంగ గుహాస్యమందు, మం
జీర మనంగఁ బాదపవిశేషపదంబుల, వ్రేలు ముత్తియాల్
పేరన శైలకంఠములఁ, బృథ్వి మెఱుఁగన రాలుటాకు న
వ్వారిగఁ గానిపించి తొలిపల్కు తెఱంగున మ్రోయుచుం
[డువే,
కోరిక నాట్యమాడుదె,యకుంఠితమా తలఁబ్రాలువ్రాలెఁ జె
ల్వారుదె, చాటుచాటు వెలివత్తువె; చూడ వినంగ నేర! ప
క్షులు నీదు పోకడలు, తెన్నిది యంచు నెఱుంగలేము, నీ
హారున నర్థమేమికలదో గ్రహియింపఁగలేము, కానలో
ఘోరమృగాళిఁ బావకసుగోష్ఠి సతంబును బోధసేయు, నీ
నీరముతన్న నీదు రమణీయవిలాసము కంటి కింపుకాన్

దూరము నివ్వనాంతరపు దుర్గమమౌకనుమన్ సృజించెనో!
భేరి నినాదమట్లు వినిపించెడు నీధ్వని సేతఁ బిల్లలై
చేరి, పియచ్చరాంగనల శ్రీఁగనునీనడ సేత బాల్యపుం
బూరుషులోచు మోహపడి, పూర్ణమతుల్ ముదునళ్ళ
[తెల్ నెఱిల్
దీకున ఫేనమీను నినుఁ దెల్వికినిల్వవటంచు జ్ఞానులై
యారసి, సన్నుతింత్రుకద యాతురతన్ భవదీయ యాత్ర
[కుల్.

—•—

# XI వింతవిలోకనము.

చ. పదిపయి నాలుగేండ్ల యెలప్రాయపుఁ బెంపువహించు మై
[పసల్
కుదిరిచి కచ్చకుచ్చెదగఁ గూరిచికట్టిన జిల్గుచీర సొం
పొదవఁగఁ గన్యకామణి మహోదధి సాంధ్యతరంగ ఫేన సం
పదల కెలంకునొక్కరిత స్వైరవిహారిణియౌచుఁ జొక్కెడున్.
చ. అరయఁగఁ గానరారుకద యాప్తులు బంధులు కానియా
[మెముం
దఱ వెను కెందుఁ జూచినఁ దదాత్మను నెంతయుఁ గోరి యే
[మనో

పాఱునకో యిట్టులట్టుల నడాడుచునున్న దటన్న జూపులం
దరమర యించుకేనిఁ గననైతిఁ గరంబు విమర్శ సేసినన్. 2

సీ. ఎడఁబయ్యెదనుహాత్తి నుదుట ముంగురులొత్తి
చలువ పయ్యెరల నాసక్తిఁబిల్చు
పిరియురింగు లదల్చి యొరయునందెమఱల్చి
పైఁబడు నీట విభ్రమత నాను
మొలనూలు సడలించి జడ పూలు కుదియించి
గుల్లరంగుల మేలుకోర్కె.. నేరుఁ
గెమ్మోన్నవి నవ్వుఁదాల్చి క్రేఁగన్నుఁ గవఁదేల్చి
యలయపారాబ్ధి ప్రియానఁజూచు 3

గీ. నంతియేకాని యితర మొక్కింత కనదు
పలుకరించదు కడు పారవశ్యయగుచుఁ
దనదుహృదయాబ్జమం దెట్టి తలపులూని
మెలఁగుచున్నదో తెలుపదు తొలఁగిచనదు.

తే. ఎవరి లతకూన యగునంచుఁ దివిరి యెవ్వ
రైనఁ బలికింప యత్నింతు రేని యూర !
నిష్ఫలంబయ్యెడిని యల నిమిషమందె
ముగుదసిగ్గు తొట్రిలఁగ మార్గమును వెట్టు. 4

ఉ. తుమ్మెద యంటులేని నవతోయజరాజము బోల్కి దోషహీ
నమ్మయి కుల్కు నాపె వదనమ్మునఁ బెట్టనిసొమ్ము గాఁగఁ
[బ్రే
మమ్ము తలిర్చుచుం బరుల మానసమున్ హరియించి.
[నూత్న భా
వమ్ముల నిల్పి యార! కనుపట్టెడు నొక్కని కొక్క వైఖరిన్.

ఉ. ఎవ్వరి చిన్నదానవగు దేటికి నొంటిగ నిట్లు వచ్చితో?
యెవ్వి త్వదీయభావనము లిల్లెటు నాకొక రవ్వదెల్పు మీ
మవ్వపుజవ్వనీ! యను చుమామక మిత్రవరేణ్యుఁడొక్కఁడా
నివ్వెరపాటుఁదీఱ్చుకొన నీతిమెయిన్ గదియంగఁబోయినన్.

ఉ. ఆతని సాహసంబుడిపి యల్లన నేనిటు పల్కినాఁడ; నో
భ్రాతృవరేణ్య! యట్లడిగి రామమనోహర ముగ్ధచేష్ట సం
భూతకలాకహాస్యముల పొందికకన్ వెలియాటలేల యా
కూఁతుకయూరు పేర్వడిచి కూర్చెదు దృష్టిసుఖాబ్ధిఁ దేలుమా.

కం. అని యతని సమ్మతింగొని
గొనబగు నొక యుసుకతిన్నెఁ గూర్చుని తమిమా
కనుఁజూపు సాగునంతకుఁ
గనుఁగొంటిమి యల్లవింత కన్నియ మిన్నన్. 8

చ. కనికని యామె చెయ్వులను గౌతుకమందుచు నెట్టకేలకున్
గనఁబడదింక దవ్వరిగఁ గన్నియ యెవ్వరిదో నటంచు నె

మ్మనమున నద్దియెల్ల మటుమాయఁగఁ దాలిచి యప్పుడప్డు జ్ఞ
ప్తినిఁగొని మేముతద్వ్యథము వింతవిలోకనమంచు నెంతుమే.

—:o:—

# XII శాద్వలసుమము

———(o)———

చ. జలజలజాలుపాఱు నొకసన్ననితీయనిపంటకాల్వకా
వలిదరి నిర్జనంబయినపచ్చని మెత్తనిశాద్వలాంకురం
బులపఱుపున్ మనోహరపుఁ బొద్దును బుచ్చుచునున్న
[నాడు క
న్నులకునుదర్శనీయసుమనోజ్ఞసుమంబొకటల్లితోఁచుచున్.

చంపకమాల.

తనదగుచిన్నిమోము నొకతట్టునకుఁ మఱలించి గడ్డిలో
నొనబగురంగుడాచుకొని కొంకుచునుండిన నంటి నిట్లు „ఓ
మనసగుపువ్వమిన్న! యనుమాన మదేల? త్వదీయజీవనం
బునకును సాటియెద్ది? పెనుపుఁగనుదానవు పచ్చికందులఁ,
దనిసెదువాఁగుతుంపఱ, విదాహము తీర్చుకొనంగనేర్తువే
నునుఁదుహినంబులన్ బుతువునుఁ బడువానల, నైక్యమా
[దువే

జినుఁగునుఁ బ్రకాశమునఁ జెల్వఫు వెన్నెల తెల్పులందు, లే తనపులఁ గుల్కు-దేయరుణశక్తి బ్రభవించెడు బాలభానుచూ డ్కి-నిరమణీయ సంచలనక్రీడలఁ జొక్కు-డె మందమారుతం బున, బెదరంగనేల? మొగమున్ జెడపెట్టఁగనేల? సమున్నదం బును విడనేల? యీవ" నినఁబువ్వీటు మాఱువచించె

[..నన్న! యా

ఘనమగు భోగముల్ పడయఁగన్ దగుటల్ మానునీదు పాదఘ ట్టనమును దప్పఁజాలినక దా మునియాసలు బాసితిన్ గదా."

---

# XIII నావిరవల్లిక

—○—

ఉ. పల్లియమూలవీధి నలువంకల నింకొకయిల్లు లేదు మా
పల్లనభోజనాలసమయుంబయి సందశితప్పెనో షధీ
వల్లభుబండు వన్నెకను బాడువొనర్చెడుఁ బంటచేనులన్
సల్లలితానిలంబు వెదజల్లెడుఁ జల్లదనమ్ము మాఁకులన్

తే. ముంగిలి నెనంగు తిన్నెపై మోవ మొలయఁ
జుట్టుఁ జోద్యంబు కందోయిఁ జూఱఁగొనుచు
నొండు నవయౌవనుండు కూర్చుండి యుండె
సృష్టి నగ్గింప నెంచు కవీశుమించి.

శా. ఆహాహా! పవలెల్లఁ బాటుపడి ఘర్మాంభః ప్రపూతంబులై
దేహంబుల్ తనియన్ జెలంగునిట నీదృక్షుంబుగా సృష్టియు
న్బ్రహ్మాబాహిని రాచుకొంచుఁ దమదంభాధిక్యమున్ జూపసం
దేహంబందని పట్టణస్థులకు సిద్ధింపంగఁ బో నేర్చునే?

తే. నీలజీమూతపథమునఁ గ్రాలునిఖిల 3
గోళముల నిన్నె చంద్రమా! లీలఁ గాంతు
నోగుబాగుల నుయ్యాల లూఁగుచుండి
యెపుడో నెలకొక్క మాఱేపు నెలయుచుండు. 4

తే. ఎడపదడపను వరిమళ్ల తడుపు లందుఁ
గలియు నీసుధాకరవృష్టి కలన నేమొ
ధాన్యము పసిమిచాయను దనరుచుండు
పట్టినీటనె యగు నేని యట్టులున్నె? 5

తే. ఇరులుకవిసెనునింతలో నెందు నుండొ
తోయదాచ్ఛాదితుండయ్యెఁ దొగలఱేఁడు
ఓహో! చిమ్మెడు చకచకద్యుతుల నందు
సానరాపిడిఁ దేలు వజ్రంబు సరణి. 6

తే. నిర్మల ములగు కాలువ నీరములను
ఆకుల మఱుంగు వెన్నెలయుండ మయర!
మాచుకోలఁదని సొంపుగఁ దోఁచుచుండె
మచ్చలు కలట్టిలేడిమైమచ్చు మెఱసి. 7

తే. డోలికలఁ బండుకొనుఁ బసిబాలలట్లు
కెంపు లొలికించు చిగురాకు జొంపములను
గూర్కొనొందెడఁ బోలు శకుంతతతులు
కానిచోఁ జెవినిబడదె కలరవమ్ము. 8

తే. గోపబాలుండు పొలమున గోగణముల
విప్పి పాలకావడినూని వేణు వూదు
కొనుచుఁ దనయున్కిఁ జేరెడు వినఁగనయ్యె
హృదయరంజకమైన శ్రీకృష్ణగీతి. 9

తే. ఇంతదనుకఁ దల్లిపొదుఁగుఁ సంతసమున
గడుపు నిండారఁగుడిచి మ్రాఁగన్నువెట్టు
వెల్లలేఁగపైఁ బ్రసరించు వెన్నెల జిగి
సితతరంబయి నిశ్చలస్థితిని నెగడు. 10

తే. అదియె చలియించు పచ్చిరావాకుపైని
చాయతఱుఁగుచు మిగులచంచలతఁ బొరయు
అబ్రిపడనేల? సహజంబె యద్దియెందు
నాశ్రయంబుల గతులెపో యాశ్రితులకు. 11

తే. అలరుఁగొమ్మల రవళిక నాలకింప
సాఁకబడెనేమొ నిశ్శబ్ద మీకడలను
శాంతమాధుర్యరవము నిరంతరంబు
వినఁగవచ్చెడు నుండిలే దనఁగ నహహా! 1

ఉ. ఇట్టిమనోజ్ఞసీమ లభియించిన నిర్మలమానసంబునన్
గట్టితపస్వియొండు పరకాంక్షలఁ ద్రెంచి తపం బొనర్పఁడే?
అట్టనేల యొండునవయౌవనశీలుఁడు ముద్దుగుమ్మఁ జే
పట్టి మనోజులీల కయివారము సేయుచు హాళిఁ దేలఁడే?

కం అని పలు దెఱఁగుల సృష్టిని
గణియించుచు నడుమనడుమ ఘనముగ నెదియో
వినుకలిబడ వినుచును నది
తనుఁగాదని యెంచుకొనుచుఁ దరుణుఁడుండన్. 14

కం. అమ్మాయీ! మగనికె నీ
ళ్ళిమ్మా! లేవంగవచ్చు నెపుడును నాల
స్యమ్మయగు నని యెడు వా
క్యమ్మును నొడువంగనయె గృహాంతరమందున్. 15

చ. అదివిని యేఁకునన్ బెరటియం దలరారెడు 'వర్ల' బావి యం
దుదయమునొందె నీరములనొప్పుగఁ జేదెడు నిస్వనంబులన్
బొదలెడుకంకణప్రకట పూర్ణరఝణంరఝణా, మంతకంతక
య్యది తమినాలకించుచును నా దెస నాతని దృష్టిపాఱఁగన్.

ఉ. లోపలనుండి చంచలవిలోచనయొర్తుక నిండునీళ్ళ చెం
బోపికనొక్కకేల ధవళోచితమౌమడుఁగొక్కకేల నెం
తోపరువుప్పతిల్లఁగొని దోపినకుచ్చెనుజార్చి గుమ్మమం
దాపకువంపునూర్పి కన నల్లనడంకువనుంచి లేచుచున్.

ఆ. ఎన్నికలనుగన్న యించువింటి బిగించి
వదలు మోహకుసుమబాణ మనఁగఁ
బొలుపు వలపుఁదెలుపు బొమగవఁ ద్రిప్పుచు
నొఱపుఁజూపు చులుకు నెరపుచుండె. 18

కం. తడిసినహస్తతలాబ్జముఁ
దుడుచుచు నద్దానికతనఁ దొలఁగినపయఁటన్
వడి సవరించుకొనుచు న
య్యెడ ద్వారంబుపయి నొరగ నెంచుచు నుండన్. 19

మ. వనజాక్షీ! యెదియైననుండు నటనాద్వారంబుపై నానఁబో
కనుచున్ గాంతుఁడు కాంతపాణితల మత్యంతంబుఁ జేఁబట్టి పే
రనుఁగున్ గుప్పచుఁ జేరఁదీయుచును గాఢాలింగనోద్యుక్తుఁడై
తన వామాంకమునందు నిల్పుకొని యాతన్వంగితో నిట్లనున్.

మ. చెలియా! చేతులలాగకున్న జలముల్ చేరంగ వ్రేళ్ళజ్జగా
నలిఁగెన్ బోఁ గలశంబు తెచ్చునెడ మేనన్ జెమ్మటల్ పూసెనే
యలివేణీ! మొగమ్ముల్లు వెట్టకుము సిగ్గందంగ రాదిందు నో
ళ్లలయన్ దంపతులొండొరుల్ తెలుపుకో నాయాసముల్
[తీఱునన్.

తే. తనదు పదునాలవకళను దప్పికడవఁ
గ్రిందు మీఁదను బడుచుండె నిండుఁ డందుఁ
బద్మముఖి! నీ క్షణక్షణ వర్థమాన
మైన యాననశ్రీఁ జూపనగును గృపను. 22

కం. కంటే శారద కౌముది!
వింటే నిశ్శబ్దమహిమ! వెఱఁదీ! నిక్కం
బింటికిముంగడ నిట్టివి
యుంటొకభాగ్యంబుసూవె యుత్సవమొదవన్. 23

ఆ వె. కుందరదన ! నీదు మందహాసరుచులు
వనజగంధి నీదు తనువు వలపు
లేఁత వెన్నెల నలవాయుపోతములను
వెలితి నెల్లఁదీర్ప వెలయుచుండె. 24

తే. తెల్లనగుఁబూలగుత్తులఁ దెఱవ లిట్టు
తమ వినీలంపుసికలను దాల్చుచుంటఁ
జూచి మబ్బులు చందురు దాచుచుండు.
అల్లదే! చూడు నామాట కల్లయేమొ! 25

తే. అందమున్ జక్కఁజేసికో నబ్జవైరి
యాస్యమీనుఁజూప వానితో హాస్యమాడ
సరసి యాత్మతలమ్ముఁ జంచల మొనర్చు
భావహీనమ్ములని వానిఁ బలుక నగునె ? 26

తే. కొక్కె మొకియింత గట్టిగ నొక్కికొనుము
గిసికొనుకంటె మెడవంచ కీరవాణి !
పలుకు బంగారమాయెనా వాతెఱలను
మెదపవేటికి? యిచ్చోట మేరకాదొ ? 27

తే. రమణి! తెలియుమా వెన్నెలరాత్రులందు
చెలులు చెలువులు కూర్చుండి వలపులూర
ముచ్చటలఁ దేలుదురె యేని ముందుజన్మ
మందు వారు చకోరద్వయంబు లనుచు. 28

చ. పలుకుచునట్టె యాతఁడెలప్రాయపు బాహువునుం బ్రి [యాంగనా
లలితవిభూషశోభితగళంబునఁ గౌఁగిలిపూర్తిసేయుఁ జె
క్కులకనుదార్చి నొక్కి కొనగోరులతో నిమురంగఁబోయినన్
నెలఁతుక దానినెల్లరమణీయముగా గ్రహియించినవ్వుచున్.

కం. నాథా! చెల్లునె మనకిటు
వీధిని సయ్యాటలాడఁ బెఱవా రరయన్
శోధింతురు సఖు లెఱిఁగిన
బాధించెద రేనసకియపుఁ బల్కుల నెంతో. 30

తే. అనుచు ననియెడుసతినుడి నాలకించి
హస్తతల మల్లనల్లన నంటుకొనుచుఁ
జెక్కుఁజెక్కుఁ దార్కొనఁజేసి ముక్కు వెనఁగ
నమలస్పృష్టి హాస ప్రేరితాత్ముఁ డగుచు. 31

కం. బాలా! భార్యాభర్తలు
హాళిం దేలంగఁ గోర నన్యుల వేళా
కోళము లాటంకములా
యీలీల విచిత్రసృష్టి యెన్నఁడుఁ బొడమున్. 32

తే. కలికి! కావలసినప్పుడు కలుగఁబోవు
మంచిసమయంబు లవి యసామాన్యములుఁగా
కావున యదృచ్ఛ నయ్యవి కానఁబడిన
ననుభవింపంగ నొప్పగుమనుజునకును. 33

తే. ఉవిద! అన్యోన్య మోడఁబాసి యుండునట్టి
దంపతులు ప్రియాశంబుగఁ దలఁచుచుంద్రు
కూడుకొనుటకు రేయెండ వేఁడి వేచఁ
గూడినమనము వీడంగిఁ బాడియగునె? 34

ఉ. అంతియకాక యిప్పు డిట కన్యలు వచ్చెడువేళకాదు శు
ద్ధాంతరహస్యలీలఁ దలఁదన్నఁగఁజాలెడు చాడ్పుమీఱు నే
కాంత మొసంగు నిందనుచుఁ గాంతుఁడు సంతసమెచ్చఁ దృ
[ప్తిమైఁ
గాంతసుధాధరంపునవకంబును ముద్దిడుకొన్న మెల్లనన్.

కం. మదవతి సాధునితో నన
నెదుటనలరు రావిరవళి కెసఁగుచు నుంటన్
ఛదనంపుగూటి నిదురన్
గుదురుపడెడు పక్షి మేలుకొనుటన్ గనుచున్. 36

ఊ. ఎవ్వరు కాంచఁబోరనుచు నిప్పుడు మీరలు వల్కినట్టి వా
క్యవ్వలబెట్టి కట్టెదుట నా ధరణీరుహా సంభ్రమ శ్రుతం

బవ్విహాగంబులన్ నిదురవల్లడిచెట్టుచు జూపునీదిశఁ
మవ్వపుముద్దుఁబెట్టి నను మన్ననమీరఁ గటుసేయు జెంచుఁ

తే. దాన తరుణుండు వల్కెడుఁ దరుణినెంచి [చుక్.
„ నీవు కనుగొన్న దంతయు నిశ్చయంబె
కాని దానికి నొండొక కారణంబు
కలదు నీకును నయ్యది తెలియ సకియ!” 38

తే. „ పలికితిని నేను సందర్భవశత నట్లు
కారణంబేమొ చెప్పరె మీరు తొల్లి
మీకుఁ దెలిసినదంతయుఁ నాకుఁ దెల్ప
బాసచేసిరి చెప్పుమి పాడికాదు.” 39

ఉత్సాహము:—

అనుచు నెట్టివింత కారణాంతరంబు తెలుపునో
వినఁగ మనము సంభ్రమింప వెలఁది ప్రియునికంఠమున్
దనదు మృదులబాహులతలఁ దగఁబెనంగవేయుచున్
వినయభావ మెనయ మోము వెరిదమెడఁదఁ జేర్చినన్.

చ. నెలఁతరో! సాధ్యమే మదికి నీకడ దాపఁగనంచునామె నా
చెలువుఁడు ప్రక్కకున్ దిగిచి చెల్వెలయున్ మణికట్లు హ
[త్తుచున్
మొలికలు ప్రేళ్లనల్లుచును మించెడునెయ్యపు శ్రద్ధ నొగ్గు వీ
నులకును విందుగాఁ గతమునున్ నుడువంగఁ దొడంగె
[నివ్విధిన్.

సీ. పడకొట్టు ననుకొంచు జడియంగ నేటికి
కలుగఁబోఁ బొడుగనఁ గాల్వాళ్లు
ఎండదెబ్బనుకొంచు నెద నొంద నేటికి
పొదలుబో నిరుగడల భూరుహాళి
వేఁడిగాడ్పనుకొంచు వెనుకాడ నేటికి
జరగుబో నెడనెడఁ జల్లకడలు
ఆకలియనుకొంచు నాగంగ నేటికి
అమరుబో నూరూర నన్నసత్ర

తే. మనుచు నెచ్చెట్లొ సరిపుచ్చుకొనుచు వైళ
మత్యవసరము లైనకార్యములు పిలువఁ
దప్పదని బాటసారులు తఱలుచుండు
మిట్టమధ్యాహ్నమున నొండుచెట్టుక్రింద. 42

ఆ. బండి నాపుచుండి బండివాఁడందున్న
వారితోడ నిట్లు పలుకసాగె
నిందునుండు నేను ముందుఁ గానఁబడెడు
దారి తిన్నగానె యూరుఁ జేర్చు. 43

ఆ. మీర లడిగినయిల్లు దారినే పోవంగ
రావిచెట్టునొండు పక్కఁ గాంతు
దాని కెదుట కలదు త్వరితంబుగను రండు
పొద్దుక్రుంకు తిరిగి పోవుటకును. 44

ఉ. ఆపలుకుల్ వినంబడినయంతనె పూరుషుఁడొక్కరుండు బఁ
డాపుమటంచుగ్రిందదిగి యందున నింకనుగూరుచుండి యే
మో పలుతీరులన్ వివిధయోజనలన్ నిదురించు బాలకున్
లేపుచువచ్చినారమదె లెమ్మిఁక నెల్లిని దీయుమాయనన్.

తే. షోడశాబ్దలతాసుమశోభగరిమ
నొడలిఁ దన తావులను నలుఁగడలఁ బరప
బాలకుండును డిగియెను బాడినంత
నుభయులును దోవఁగొనిరి మృదూక్తులెసఁగ. 46

చ. పురవనశోధచేసితిమి ముఖ్యకులాబ్ధులఁ నెంచినారమెం
దరసిన గాని, యొక్కవిధి నక్కఱలే దసినాఁడ ఇందిఁకన్
సరిపడఁబోవునే మనకు సత్ఫలమున్ బడయంగఁజాలుదే?
పరుసఁదనంబుఁ బోవిడిచి భావనసేయుము తృప్తి నెంత [యున్.

తే. అనెడుఁ బూరుషువచనంబు నాలకించి
మాఱుమాటాడకల్ల కుమారవర్యుఁడు
చుట్టుపట్టుల జనపదచోద్యములను
దేరకొనఁజూచుచును నడతెంచుచుండి. 48

తే. మొదటియడుఁగు నెపోసెడు ముచ్చెమటలు
నొడలిఁ గ్రమ్మిచు దుస్తులు తడుపు చుండఁ
జేరుమాలున నొత్తుకోఁ జెంతనున్న
పొలముగట్టున మామిడి చలువనిలిచి. 49

తే. మొఱకమడిని వేసిన గడ్డిమేటినీడ
కల్లనల్లన దుముకుచు నరిగియందు
జాఱు గింజల నేరుకో జంట కుఱుకఁ
గూయి మురిపెంపు ముద్దులగువ్వఁ జూచి. 50

తే. అంత కంతకు వేఁడిమి నధిక మగుచు
నందుకొను గాడుపున నాయాస మెచ్చఁ
గాపువట్టిన కొబ్బరి తోపు కెలన
నాగి యిసుమంత విశ్రమం బందవేచి. 51

తే. కంచెలోపల విరిసి పుష్పించుచున్న
బండిగురివెంద తీవెను వలపుమీఱ
లేవనెత్తుచుఁ దక్కిన లేఁతలతల
గణన సేయని తాళవృక్షంబుఁ జూచి. 52

తే. కనఁబడెడు నీరములు దప్పిఁ దనుపుకొంద
మనయుంబులఁ గడుగుద మనుకొనంగ
ఱాతి పావంచ రేవు నాసీన మగుచుఁ
దారసిల్లిన చిన్నకోనేరు డిగుచు. 53

తే. ఉదకములఁ దేలి రాజిల్లుఁ గొదవపువ్వులు
మిగుల నింపుగ సొంపుగ నెగడుచున్న
విడిచి పుచ్చుచు బద్మములఁ విడుపుఁ బొందఁ
గొజలు ప్రతిప్రభాకర కరముఁ జూచి. 54

ఆ. వాని బూరుషుంపు వరుసఁ గనుంగొని
తనదు వాక్యములకుఁ దగవొసంగు
నుత్తరంబులట్లు చిత్తంబు నెఱుఁగుచు
మేలుఁగోరి గొడుగు మెల్లనొక్కి. 55

చ. ముడుచుచు రావి యియ్యదియె ముంగల నిల్లదె యంచు [వేఱుగా
నడుగక మెట్లనెక్కుచును నాతలుపున్ దెఱవంగఁ దట్టినన్
వడి గృహమేధి దగ్గఱగు బందుగులెవ్వరొ వచ్చిరంచుఁ దా
గెడ నెడలించిచూచె స్మృతికిన్ స్ఫురియింపదు వారిఁ [జూచుటన్.

తే. అయిన మర్యాదకనుక పాద్యంబు లిచ్చి
లోపలికిఁగొంచు బల్లనుజూపి యందు
నెలమి దయసేయుఁడంచు శీతలజలమ్ముఁ
గ్రోలగానిడి దప్పికఁ గొంతఁదీర్చి. 57

తే. ఎండఁ బడి వచ్చినారలె యిల్లువిడిచి
యెపుడు బయలుదేఱిన వారొ యిర్వు రిపుడు
సరగ మడిఁగట్టుకొని రెండు జలుపఁ దగును
ముందు భోజనంబేము మోమోట పడక. 58

తే. అనుచు వడివడి పట్టుపీతాంబరములు
తెచ్చి యిచ్చిన వానినిఁ బుచ్చుకొనుచుఁ

బూరుషుండును సందర్భ పూర్వకముగఁ
బలుక సాగెను నించుక బయలు పడఁగ. 59

తే. ఆర్యసత్తమ! యేమాత్ర మన్యసరణి
నెంచబోకుము మీకలః వృద్ధు లగుట
మమ్ములను జూచియుండరు మాజనకుల
జనములను దెల్ప నెల్ల విస్మృష్టపడెదు. 60

తే. అంతెకాక వచ్చిన కార్యమంత యిందు
సానుకూలంబు కాఁగలదేని ముందు
మీరు పిలువకే వచ్చెడవార మెన్ని
సారులైనను మీయూరు దూరమనక. 61

తే. అచ్చెరువుహెచ్చె దాన గృహస్థుమదిని
నిట్టులట్టుల వెనుముందుః జుట్టుపట్ల
తలచి యెవ్వరో వారి భాంధవ్యమెదియొ
స్మృతికిరామి మగుడ శ్రద్ధఁ జెవులనొగ్గ. 62

ఉ. అంతటఁబూరుషుండు తమ యన్వయమున్ దమ తల్లి దం
[డ్రులన్
సంతస మొప్పఁజెప్పనది సర్వముఁ బూర్తిగనాలకింప క
త్యంతముదంబునన్ బలికె ,ఆ ! యిక నెల్లనుగోచరంబె
[మీ
రింతకు వచ్చు టెంతయును నీక్షణ భాగ్యమటుంచు నేర్తె
[అన్. 63

తే. పలికి వాస్తవ్యుఁడింటి లోపలికి నరిగె.
నంతవఱకును నాశల నరయు చున్న
బాలకుఁడు నవ్వి పురుషుని బలుకరింపఁ
బోవుచుండిననంత సమ్మద మెలర్ప. 64

సీ. కమ్మకచ్చూరి తైలమ్ము నొత్తిన నల్ల
నుంగురుల్ మోమున ముసిరియాడ
అగులుబొట్టును బట్టియద్దిన నునుఁగెంపు
కుంకుమ నుదుటను గులుకఁ గొలుప
తడిగుడ్డతుడుపులఁ గడుదిద్దిన బెళుకుఁ
గాటుక కన్నుల నీటు నెరప
ఒడ్డాణమునుఁ జేర్చి యొప్పించు వలెవాటుఁ
బయుఁట నెమ్మేనున వలపు నిలుపఁ

తే. గన్నెయోర్తు పడమటింటి గడప దాటి
కొంకునందియల్ మ్రోయంగ గాటిదరికి
నేగి పొత్తముల్ కొంచును సోగచూడ్కి
వారిపైఁ జూచిచూడని తీరుఁ బఱపె. 65

తే. పిల్లచూపునఁ జిన్నవాఁ డుల్లమందు
సంతసిల్లి పురుషునకు సంజ్ఞచేసె
పూరుషుండును నద్దాని తీరెఱింగి
బాలికనుగూర్చి ముద్దగు పలుకు లొనర. 66

కం. అమ్మాయీ! బడి కేగుదొ
"రమ్మా! యిటు లొక్కమాలు రమ్మా"! యనియొక్
గొమ్మయు రమ్మని యనఁగన్
నెమ్మికఁ దాపునకువచ్చి నిలువంబడుచున్. 67

చ. పొడమెడుసిగ్గుచేత నెఱిమోమును వంచుచు బల్లపైని గో
ల్లిడి యొకవింతగీయుచును నింపుతలిర్చెను బూరుషుం [డునుం
"బిడియము చెందకమ్మ యదె వేగము బాబయ వచ్చువారు [మా
కడలను గూరుచుండు" మని కన్నియనుం బయికెక్క సే [యుచున్.

ఆ. చిక్కువడిన పొట్టి చిన్నికాసులపేరు
సరిగఁ దీసికొనుచు నరుణచరణ
యుగము దాగమడచి యొప్పుగఁ గూర్చుండఁ
బేరు చెప్పుమన్నఁ బేరుచెప్పె. 69

ఆ. తీవ్రమైనయెండ దిగజారి నీడయు
జగిలెపైని వ్యాప్త మగుట నరయు
బడికిఁబోవువేళ యపుడెకావచ్చెనా
యావు చదువు తరగ తెద్ది యన్న. 70

ఆ. బడికిఁ బంపరచటఁ బాఠంబులందున
నేర్వనుండదంచు నేర్పుచుందు

నాన్నగారె తీఱి యున్నప్పుడెల్ల మా
యఱుగుమీఁద వీని నంచుఁ జెప్పె. 71

ఆ. ముందునుంచుకొన్న పొత్తంపుఁబుటలను
దీసి యొక్కటొకటిఁ ద్రిప్పుచుండ
నేమిపుస్తకంబు-ఏది పాఠమొకటి
చదువు నీవెతీసి చదువుమన్న. 72

తే. బాలరామాయణంబని వడివడిగను
వనిత! నాతోడ నేటికి వనములకని
రాఘవుండన వానితో రక్తిసీత
పలుకు ప్రత్యుత్తరసువాక్యఫణితిఁ జదివె, 73

ఆ. చెంతనున్న పలకఁ జేతితో నట్టిట్టు
చెఱపి గీత పెట్టి చెఱపుచుండ
లెక్కసేయఁగలవ యొక్కటిచ్చెద నిదె
చేయుమన్న శ్రద్ధఁ జేయఁగలిగె. 74

ఆ. తలఁపునకును నేదొ తట్టంగ సద్దాని
నూహ సేసికొనుచు నూరకున్న
పద్యపుస్తకముల పఠియించితివ యేని
యొప్పగించుమన్న యొక్కటన్న. 75

తే. ఏ శతకమందు పద్యమో యెంచుకొనుచుఁ
గొంతసేపు యోజించుచుఁ గోకిలంపుఁ

గంథమును నెత్తి పఠియించెఁ గడకునొక్క
కందమును గుమారీశతకంబు నుండి, 76

ఆ. ఉండియుండి యెదుటనున్న బాలకు పైనిఁ
జూడ్కి నిల్పి మిగులఁ జోద్యముగను
క్రొత్తరాగ మొండుఁ గూర్చుకొనుచు నుండఁ
బాట నొక్కదానిఁ బాడుచున్న. 77

ఆ. చెలువ చాలతడవు సిబ్బితిఁబడుచును
బాడెఁ బూలచెండ్లపాట నొండు
వినెడువారి కెంతొ వీనులవిందుగా
స్వాదురసము లొలుక వరుసఁ బెట్టి. 78

ఆ. ఏమి సేయుచున్న నిదియేమి పీరలు
ఎదియొ యొండుదాన నిచ్చుచుండి
రనుచు నిట్టునట్టు లరయుచు నుండంగ
"అమ్మ! యొక్కమాఱు రమ్మటంచు". 79

ఆ. పిలువనయ్యె దానఁ జెలువనుఁ బురుషుండు
వెళ్లనిచ్చెనమ్మ తల్లి పిలుచు
నన్న బల్లదిగుచుఁ గన్నియ లోపలి
కేగి నిల్చి యమ్మ! యేటికనియె. 80

తే. తల్లి వెండిగిన్నె పిల్లచేతికినిచ్చి
పిన్ని యింకఁ దోడుపెట్ట దేమొ

దీనఁ బాలు ద్రోఁడి తెమ్ము నీ కయ్యెడు
నత్తవారు వా రటంచుఁ బలికె. 81

చ. అడికనిపెట్టి వారి కపు డాగఁగఁ దీఱిక లేమిఁ గొత్తఁగా
బొదలెడుఁ జన్వుఁ జూపుచును బూరుషుఁ డాయిలుసొచ్చి
[«యయ్య! ఏ
మిది శ్రమనొందబోకుఁ డిట నిప్పుడు నిల్వఁగఁగాదునాకు వె
ళ్లెద" మని పల్కు, «వచ్చితిరో లేవో యిటుల్ చను దేర భా
[వ్యమే"

తే. అనుచుఁ బీటల వేయంగఁ బనిచి వాని
నందు విచ్చేయుఁడంచును నరుగు డెంచి
నట్టి కార్యంబు సర్వంబు నందు జరపి
నట్టిదాని నెఱుఁగు దు గృహాధిపతియు. 83

కం. వా రిఁక నుండ మటంచున్
సారెవచించినకతమున మఱి మీ కరుగన్
గోరిక యుండిన నే మన
నేరుతు నేఁ బొద్దుపోవు నిలిపిన ననుచున్. 84

ఆ. తిరిగి పురుషునాపి సరిగ మా యిల్లెనఁ
జూడ లేదటంచుఁ జుట్టుఁ బెరడు
గదుల నెల్లఁ జూపి మదిలోని కోర్కెల
నరవిఁదెల్పె నెంతో సరసముగను. 8

ఆ. బాలకుండు మాత్ర మాలోపునె తాను
వీధియఱుగు నాని వింత నిలిచె
నుక్కుపోయునింట నుండంగలేమి నో
యాత్మఁబోడము తలఁపు లాపలేకొ. 86.

తే. అతని హృదయసరోవరమందు నల్ల
కన్యకావృష్టిపతనము గాటమైన
భావ వలయంబులను గూర్చి ప్రతిరుతమన
వాక్యముల నివ్విధిని బయల్ వడఁగఁ జేసె. 87

తే. "భ్రమరమా! యింక నీ పరిభ్రమణ ముడిఁగి
యా నవోత్ఫుల్లపద్మంబు పైని వ్రాలి
యలవడెడు స్వాదుమధువుల నానుకొనుచు
సంతతంబును గనుము నితాంతశాంతి. 88

తే. తిరిగితివిగ కాననముల నరసితివిగ
కొలఁకులను జూచితివిగ తోటలను మిగుల
చంచలంబని చూపఱు లెంచుకొనఁగ
నెఱుఁగవా యిందు సీసము మెసఁగుచుంట. 89

ఉ. నీమనమందు నెట్టుకొను నిష్ఠురచింతల నొల్లఁబాపి స
త్ప్రేమముఁ బెంచి నిన్ను పరితృప్తునిగా నొనరింపఁగల్గుచున్
గామిత మోదమిచ్చెడు వికాసయుతమ్మగు మానసాబ్జమే
మేమియు సందియంపడక యీవు వరింపఁగఁ జెల్లునిచ్చమై,

ఉ. ఈవసుధాస్థలిన్ గలుగ దెయ్యెడ నచ్చినదంచు నన్న యా
తావకరూఢివాక్యమును దబ్బఱ సేయ నదృష్టదిష్టమై
చేవడుచున్న యీయనుఁగుఁ జెల్వపుఁబూవును జెట్టపట్టి స
ద్భావసువాసనల్ కఱపి తద్దయు నిశ్చలసౌఖ్యమందుమా!

తే. తొలుత నీ నుండి తమినిటు దొంగిలించు
కొనిన మోహాగ్నికణములు దినదినమ్ము
వృద్ధి కాంచకయున్నె విశుద్ధముగను
స్వాతిచినుకులు శుక్తినిఁ బ్రబలుసరణి. 92

తే. దైవమును నెంచి యుండు నద్దాని నీకుఁ
గాక పోయిన నీ విటు రాక యుండు
కోకిలము సేరునే లేఁతకొమ్మ నెఱిఁగి
మలయవాయువు కూర్పంగఁ దలఁపకున్న. 93

కం. నీ మది కెయ్యది యింపో
యా మాడ్కినె సేయఁదలఁతు కార్యలు నీ కిం
దేమాత్ర మెదురు వలుకరు
ప్రేమం బిట నిశ్చయింప వెనుదీయకుమా." 94

కం. అని పలువిధముల నా క
న్నెను దమిఁ బరిణయ మగుమని నెమ్మదికిన్ బో
ధన సల్పుచు నిల్చిన బా
లుని కన్నులకగపడె నల లోలాక్షి మఱిన్. 95

ఆ. జనని పనిచినట్టి పసుపునఁ బాలను
బూని పచ్చుచుండెఁ బొందుకుదురఁ
దనకు సత్త్వారె యనిన వాక్యంబులు
మదిని నొక్క వింత మమతఁ గొలుప. 96

కం. ఆ రమణి నడక తీరును
నారసి యబ్బాలకుండు నాశ్చర్యముగన్
గోరిక లుప్పతిలంగను
నీరీతిన్ దలఁపసాగె నింకయుఁ దనలో.

తే. "కన్నె సౌందర్యసంపద గరిమ కంటె 97
స్వాదుకలకంఠ కంఠ భూషణముకంటెఁ
జూడ సొబగైన కనుఁగవ చూడ్కి కంటెఁ
గడు మనోజ్ఞత లొలికించు నడలకంటె. 98

తే. ఘనతరంబుగ నెద్దియో కడలు కొనుచు
జూమకాత్మను హరియించు మఱలమఱలఁ
జూచుకొలఁదిని నొకవింత తోఁచుచుండి
క్రొత్త నెమ్మని మది నిగురెత్తసేయు. 99

తే. అతిదృఢం బగు శాఖల నంటి యున్న
నట్టులిట్టుల దడదడ నాకులాడు;
అతి విశాలాంబరంబున నలదుచున్న
జలజహితమండలముకుమారిలు ను నుండు. 100

తే. కాని కోమలి మృదులంపు కరతలముల
నలుగు ధవళంపు క్షీరంబు లనుభవించు
నతులస్వస్థత హృదయమా! యరయ వొక్క?
వదలకుము తత్సుఖస్థితి వదలఁబోకు.'' 101

తే. అనుచుఁ దలపోయునంతలో నాగృహస్థు
నుండి శలవును గొని పూరుషుండు ,,తప్ప
కిటికి కేగినవెంటనే యెల్ల మేమొ
యుత్తరమువల్ల దెలుపుదు ముందుఁ డింక. 102

చ. వెనుకకుఁ బిల్వఁబోకుఁ డిఁక వెళ్ళుచునుంటిమి మీకునల్లుఁడై
యనయము పండుగుల్ పిలువ నర్రిలి వచ్చెదు వాఁడితం
[డు'' ,,జా
గొనరిచినార మిందుఁగడు నుండునె యింకను బండి యు
[చ్చోటన్''
,,గనుగొను మింక నొక్కపరి కన్నియనున్ మన మోగ్రిల
[వచ్చెదున్.''

తే. అనుచు వీథి గుమ్మము దాటి కొనుచు నందు
నిలిచియున్న బాలుని భుజములను సేయి
వైచి చిఱునవ్వు నవ్విన బాలకుండు
మోహపుం లజ్జవడుచు మార్గమ్మును వెట్టె. 104

తే. బాలికయు వారిఁ జూచిన వదినె యొక్క
వింతపుయిలోటుఁ బొందుచుఁ జెంతనున్న

కోమలచ్ఛాయ సౌభాగ్య రమ్యమైన
రావిచెట్టుమాటున డాగి త్రోవ యిచ్చె. 105

తే. సిగ్గులొగ్గిన వారల చేష్ట లెంచి
రావికొమ్మంతఁ బూనెను బ్రతిన నిట్లు
యిప్పుడింతఁగ లజ్జించు నీయిరువురు
నొండొరుల్ ముద్దు లిడుకొను చుండఁ జూతు." 106

తే. అనుచుఁ జెప్పిన కత మెల్ల నాకలించి
పువ్వుబోణియు తెలి చిఱునవ్వు లొలుక
"తత్ప్రతిజ్ఞనె యీ రావి తలఁచియున్నఁ
బూర్తి నెఱవేఱుకే సిద్ధిఁ బొందుచుండె." 107

తే. అనుచు నాథునికరుణ హస్తాబ్జతలము
లేవనెత్తుచు ముద్దాడి "లెండు మీర
లన్నయును వదె ముడిగట్టు కొన్నవాఁ" డ
టంచుఁ బలికెను గాంతుఁడు నట్లొనర్చె. 108

తే. వా రుభయు లంత తలుపును జేరవైచి
కొనుచు వెడిలినారలు నాటఁగోలె నందు
వచ్చుకపులకుఁ దానట్లు పట్టినట్టి
ప్రతిన నెఱవేఱు టనయము నా రావి వినుచు. 109

---

# XIV కృష్ణ

—:౦:—

ఉ. ఇక్కడ కేను దొల్లియొక యేడునఁ జూడఁగవచ్చినప్డు మా
యక్కయు బావయున్ గలిసి యాలను లేఁగల మేపుకొంచు నీ
యిక్కలఁ బ్రొద్దుపుచ్చెదము, నేమిదికన్పడకుండె నేమియున్?
అక్కట! తాఱుమాఱయిన దంతయు నెందున నున్నవారొకో॥

సీ. తెలివేకువలయందుఁ గలరవంబులఁ గొల్చు
పెద్దవృక్షము వ్రేళ్ళఁ బెల్లగిల్లె
రెండుజాముల వేళ నిండునీడ నొసంగు
పూలపందిరి నేలఁ గూలఁబడియెఁ
సాయంతనములందుఁ జల్లగాలినివీచు
ఘనశిలాతలములు తునుకలయ్యె
రాత్రిభాగమునందు రక్షణంబొనఁగూర్చు
చిన్నకుటీరంబు శిథిలమొందె. 2

గీ. యేపునొప్పెడుపచ్చిక లెండువట్టె
దొడ్డికెల్లలపుచ్చునఁ దొఱగిపోయె.
కోఁడెదూఁడలరాట్లన్ని యూడిపడియె
చిన్నత్రాళ్ళుట్లుసర్వము చీకునొందె. 3

తే॥ గీ. కదుపులెల్లను అయ్యయో! చెదరిపోయె
పడమటావులు కటకటా! బక్కచిక్కె

ఆల బోతులిప్పిరో? కుమ్మరాముకోనెపు
నెట్టిపాపము పుట్టెనో చుట్టుపట్ల. 4

కం. వినఁబడదు వేణునాదము
వినఁబడవుగ మందకుక్కల బిగ్గఱ మొఱుగుల్
వినఁబడవు గొల్లసుద్దులు
వినఁబడ దొకయీలయును వింతఁగు జూడన్. 5

శా. హా! కృష్ణా! యెటు పోయితీ వయయో! అన్యాయంబుగా
(దోఁ చెడన్)
నాకున్ జెప్పఁగలేకపోయితివె? అన్నా! మృత్యువున్ బొందితే
లేకుంటే కనకుందునే జగతి నీ వ్రేలల్ వినన్ నేరనే
యేకాంతస్థ పదార్థముల్ బెఱికెనీయింపైన ప్రాణంబులన్?

కం. వడగండ్ల వాన నైనను
వణకని నీమేను పెద్దపామున కైనన్
జడియని నీమానసమును
పడిపోయెను ఘోరమృత్యుపాతను కృష్ణా! 7

కం. నీ వేణునాదముల నిఁక
నేవేళను వినఁగనేర నీవిఁక గీతా
భావంబుల నాకెంచను
కావలెనని యున్నఁగాని గలపవుఁ కాదే 8

ఉ. ఈ సెలయేటి నడ్డుపడి యీఁదఁగ నేరదు గోపబాలకుల్
వేసెద నొక్క త్రాటివని వెన్క వదించితి వేసినాఁడవే ?
యాసమమైన చెల్కకొక యింటిని గట్టెదనంటి కట్టితే ?
హా! సఖ! యేమి చేయఁగలవాఁత కునిన్నటునుండి వేయుచో.
ఉ. కోరిక లెన్ని యేని మఱిఁగూర్పఁగ వచ్చును గాని యవ్వి చే
కూరెడు భాగ్య మబ్బఁగ నకుంఠిత జీవిత ముండవద్దొకో?
ధారుణి నిల్చి యీజన పదంబుల కెంతయు మేలు సేయున
ద్భారము చాలబూనుదని తద్దయు నేఁ దలపోసి యుంటి
తే.గీ. ఇంక నెప్పుడో నేమంద లేలునపుడు [మున్.
నీదు చెంగటనే యుండి మోదమునను
నిర్వ్యరము తోడు నీడగ నెసఁగు వార
మనుచు నాసించి యుంటిని ననవరతము. 11

సీ. లలితంపు సెలయేటి జలజలం బాలించి
యూహించు చుందుమే యొక్కనాఁడు
కొమరు మీఱెడు కొండ కోనల విహరించి
యుప్పొంగు చుందుమే యొక్కనాఁడు
తిలకించు చుక్కల తళుకుల బొడఁగాంచి
లెక్కించు చుందుమే యొక్కనాఁడు
నచ్చిన విరివైన పచ్చికలను వేణు
వ్రాదించు చుందుమే యొక్కనాఁడు. 12

గీ. ననుచు మురిసెడు వాఁడనో యనఁగ మున్ను
నిట్టు లగునని యెన్నండు నెంచ లేదు
కట్టి! ధైర్యంబు నాకింక నెట్టులుండు
కార్యముల బూని సఫలతఁ గాంచ నున్న. 13

ఆ॥వె. ఎంతొ ప్రేమతోడ నీ ప్రదేశంబుల
మలయు చుండువాఁడ వలదినముల
నిప్పు డొక్కమాఱు నే ఋతువున నైన
బుద్ధి వీఁడఁ జూడఁ బుట్టకున్నె. 14

తే॥గీ. మొక్కమావితోటను గాచు ముసలితాత
జోకమగు పండ్లమేలేర్చి తోక బుట్ట
వేసి బడ్డిరి ప్రేలాడఁదీసెనదిగో!
మనల కొఱకని వానిని దినఁగ రావొ. 15

తే॥గీ. దమ్ము చేసిన యట్టి కేదారములను
నాకు నూడ్చెడు వారలు హర్ష మెచ్చఁ
గంఠములఁ గల్పి యెక్కుడి గానములను
వింతఁ బాడెద రంచును వినఁగ రావొ. 16

తే॥గీ. ఉదయ మెల్లను గుప్పను నూర్చి యంత
తెచ్చినట్టి చలిదిముంత తృప్తితోడఁ
గుడుచు పాలికాపుల యల నడవడికలు
చోద్యము లటంచు నెంచుచుఁ జూడ రావొ. 17

తే॥గీ. గ్రామ మధ్యంబునను నొప్పు రావి నీడ
లందు తీఱుబడిని గూడి హాళి కాళి
ముచ్చటాడుకొనుచునుందు రెచ్చటికను
ననుచు వారితో భాషింప నటకు రావొ. 18

ఉ. ఎక్కడి రాక లింక నెపుడేనియు మృత్యువు వాతఁ బడ్డవాఁ
డొక్కఁడు వెండి కానఁబడుచుండుట వింటిమె? లేదు వెఱ్ఱినై
మక్కువ మీఱ నట్లు పలుమాఱులు పల్కుదు రావ రావ [టం
చక్కట! యేటి మాట లిఁక నాస్తవ రేణ్య! మముఁ ద్య [జించితే. 19

తే॥గీ. ఈ స్థలంబును నీయాల నీజనముల
విడిచి యుండఁగ నేర నియ్యెడల నున్న
నిన్ను స్మరియింప కుండని నిమిషమున్నె
యెట్లు విడనాడు వాఁడనీ యెనఁగు చింత. 20

తే॥గీ. చనిన వారల గుణములు మనమునందు
బొడమ నేనియు వానిని బోలునట్టి
వస్తువుల జూచుచుండిన వగపుతగ్గు
నంచు నెంతయు నేనిప్పుడెంచు చుంటి. 21

తే॥గీ వేణునాదంబులను నల వెదురు పొదల,
బలుకులను సల్ల సెలయేటి జలజలముల

నుంచి యేగితి పని వాని నెంచుకొనుచు
నిండె దిరుగాడు చుండు నానందముగను. 22

## XV రాజ్యపదచ్యుతుఁడు

తే. బాయిమును నొక్క పెద్ద యావరణముందు
శిథిలమై పోయి చెల్లెల్ల వృథగఁ బెరుఁగు
కోటగోడల నడుమను గొనకు మిగిలి
యున్న చావడిలోపలఁ దన్నుమఱచి 23

తే. చిన్న పట్టెమంచంబుపైఁ జిరుఁగుఁ బక్కఁ
బండుకొనునొంటి నలపూసపాటి కొమరుఁ
డాత్మ యందలి యూహ దేహంబు మించి
చేష్టలను సల్పు స్వప్నసుగోష్ఠిఁ దగిలి.

ఉ, ఆతని కండ్లముందు కననౌను నొగిన్ దన పూర్వులెల్లరున్
జేత స్వతంత్రమునుం చుకొని శ్రీయుతులై యొక పెద్దరాజ్య [ముల్
నీతి మెయిన్ భరించుటలు నిల్వనుమీఱిన కోటగోడపై
నాతత సైన్యముల్ నిలిచి యన్యులకున్ జొఱగామి సేయు [టల్. 3

మ. మఱియున్ గాంచెనువాఁడు గా సకల సంపద్ధార వార్షాం
[బయా
పురమున్, దీర్చినయట్టి రాకొలువునుఁ, బొల్పొందు నంతః
[పుర:
పరివారంబును, రాణివాసమున శేవన్ బుచ్చుకాంతాజన
స్వరసంబున్, మృగయా వినోద పద సంచారాటవీప్రాంత
[మున్. 4

తే. కాని నిక్కమునఁ దనకాల వైప
రిత్యమును జేసి తలయింత యెత్తఁబోఁడు
పలుకరింపఁగ నొక్క సేవకుఁడు రాఁడు
బ్రదుకు నుపకార వేతన మొదిగికొనుచు. 5

సీ. అతని ముందునఁ గేళికాలయాపనంబు
చూడువారుటఁ గాంచ మోదమెట్లు?
అతని ముందున వేటలాడు తావులు రైతు
సొంత భూములు కాఁగ సుఖమదెట్లు?
అతని ముందున సర్వస్వాతంత్ర్యములు కొని
నాను మాతృని సేయ నవ్వు టెట్లు?
అతని ముందున తన యఖిల భాగ్యంబులు
నరి కొల్లకొని పోవ జరగు టెట్లు?

గీ. శోచనీయుండు సుమ్మి యారాచబిడ్డ
మూల కొడికట్టు నొక్క యాముదపుసెమ్మె
దీపమును బెట్టుకొనుచు నిద్రించువాఁడు
పైని బూజుసరంబి ప్రాఁబనులు తనుక. 8

తే. ముంగిలిని బుంజులను గట్టు మొద్దుటాళ్లు
పుంజు లేమియు లేకయె పొడమచుండు:
ఒక్కటియొ రెండొ గోరువంక లక్కజముగ
పంజరంబునఁ బలుకు సెప్పకయె పెరుఁగఁ. 9

తే. అయిన నొక్క సుదినము కద్దతనికంచుఁ
తెలుపఁగా నెంతయును నేను గులుకువాఁడ :
దాపునను ప్రసిద్ధమగు క్షేత్రంబు కలదు
దాన నేఁటఁ దీర్థ ప్రథమ దినంబు
రథము బయలు దేఱెడు మఁందు రాజు తనదు
చేయి ముందుగ వేయుచుఁ దీయఁ జేసిఁ
గదల దించుకయైనఁ జక్రంబటంచు
నధిక గౌరవమున వానినందు నిలిపి
ప్రజలు మిక్కిలి కొనియాడువార లింక.

———

# XVI వర్షానంతరము

తే॥గీ. పెద్దవర్షంబు కురిసిన వెనుక నొక్క
సంధ్య వేళను స్వైరసంచారి నగుచుఁ
గాలివేళ్ళఁ గ్రుచ్చుచుఁ జేలగట్ల పైని
నడచుచుంటిని ఘనయోజనము లెసంగ. 1

తే॥గీ. ఆకు మళ్ళెల్ల నిర్మలమైన వానఁ
దడిసి యొకవింత చెలువంబుఁ దాల్చియుండె.
అందునందుఁ జిందెడు నీటి బిందువులను
జివరనాపంచి కుచ్చెలు చెమ్మగిలెను. 2

తే॥గీ. తెక్కలల్లార్చుకొనుచును నొక్కటొకటి
పక్షులెల్లను గూయుచు బయలుపడెను.
అల్లనల్లన గట్లు పగుళ్లనుండి
బిలబిలమటంచు ధారలు వెలికిఁదొఱఁగె. 3

తే॥గీ. ఆకసంబెల్ల యెప్పటి యట్ల తనదు
సహజనీలంపుఛాయల జరపుచుండె
నపరదిశయందుఁ జెలగె సాంధ్యాభ్రమాల
ప్రళయమందైన నారని ప్రభయనంగ. 4

తే॥గీ. అడుగులడుగున నలుగుచు నడఁగియుండు
గడ్డిపూవులకును గల్గె దొడ్డరంగు.

ఏమియును వినఁబడవె యయ్యెడల యొక్క-
వాన కురిసి వెలిసిన శబ్దములుతక్క. 5

ఆ॥వె. అట్లు కొంతవడికి నరిగిన యంతనే
వినఁగవచ్చెఁ బిలుపు వెనుకనిట్లు
"పెద్దబాబుగారె! వేంచేసినారు గా
వారిపొలములన్ని వరుసఁగనఁగ." 6

చ. అదివిని యట్టెమళ్ళ మొలనందఁగ నేపును జూపు [చేనులో
ముదుసలి యొక్కరుండు తనమూపున గడ్డిని మోసికొం [చు నా
కెదురుగవచ్చిదించుకొని "యిస్సని" గట్టునఁగూరుచుండెఁ; నే
మదిఁగడు జాలినొంది యలమానిసితో నిటుపల్కసాగితిన్.

తే॥గీ. "ఓయి! రామన్న! యిదియేమియోయి! పడుచు
నుంటి వింతలో శ్రమలను నుస్సురనుచు"
"బాబు! కాదమీకిప్పుడు పడుచుఁదనము
నేను మూల్గెడు ముదుసలి నైనవాఁడ. 8

తే॥గీ. వయసు నందున నాగలిఁ బట్టియున్న
బెల్లుబెల్లుల వడిసేల వెల్లగిల్లె.
పాఱచేతను బూనుచు నీరుకట్ట
నెవ్వఁడైనను నాకప్పుడీడు కలఁడె?

తే॥గీ. ఒక్కనాఁ డలకాలువ ప్రక్క మనకుఁ
గాపవరపు వారికిని జగడము పొసఁగ
జబ్బనాపితి నావేళ దెబ్బనొండు
తప్పిపోయినఁ దలపైనిఁ దగిలియుండు.

ఆ॥వె. మీరలేమి యెఱుఁగు వారలు నాసత్తు
వల్ల తాతగారి కయ్య కెఱుక
యింతనాటినుండి యిప్పటి వఱకును
కాచి యుంటిమనల "కంత్తు" మండె.

ఆ॥వె. దాని కేమికాని తండ్రి! మీరేమె మొ
యెంతొ పెద్దచదువు లెఱిగి తంద్రు
పాడగలరె పెద్ద భారత గాథను
జెప్పగలరె యర్థ మిప్పుడడుఁగ?

కం. మీ కక్కయ్యల పోలిక
నాకథలను వినికి సేయనగునే మీకున్?
హా! కంఠంబను చోనల
మీకడ తాతలది, యెంత మెప్పోవడసెన్.

తే॥గీ. అయిన మీకివి యన్నియు నవసరములు
కావు కాఁబోలు, రాముఁడు రావణుండు
భీముఁడర్జునుఁడను కృష్ణ నామములును
వారికథ లేమియును మీకుఁ బనికిరావు.

సీ. హరి హరీ నారాయణా యటంచును
పాడి యేతాము త్రొక్కితి నేనుమున్ను
గొల్లసుద్దుల నాడి తెల్ల వెన్నెలయందు
చేనుకాపుంటిని నేను మున్ను
హాలిహాలియని గట్టిహాలి కేక వేయుచు
నిందుఁ బండించితి నేను మున్ను
మన పురాణపు లీలలను గుజ్జులకు చెప్పి
యెంతో నవ్వించితి నేను మున్ను.

గీ. ఇప్పుడేమున్న దంతయు జప్పఁబడియె
కంఠ మందలి కంగును గానఁబడదు
ఎన్నిమాఱులో యయ్యలయెదుటఁగూడఁ
జాటువాఁడను పెదపెద్ద సామెతలను.

తే॥గీ. బాబు రండింక చీకటి పడుచునుండె
పురుగు పుట్రుండు నడచెద ముందు నేను"
అనుచు నాతఁడు మోపెత్తి కొనుచు సాగ
"ఎంత వాఁడవు రామన్న! యీ" వటంచుఁ
బలుకుచును వెంటఁ బోయితిఁ బ్రముదమునను.

———

# XVII సారంగధర

ఉత్సాహము.

"మిత్రమా! విహారమునకు మిత్రులఁ గొనిపోవుచోఁ
జిత్రములగు గథల సదువఁ జెప్పి తనుపుచుందురే"
"మిత్రమ! మనసార నట్టిమేలుకోర్కె పుట్టుచోఁ
జిత్రమైన యల్లమెట్టఁ జేరి, చెప్పుకొనఁదగుఁ. 1

సీ. పంచాస్యశార్దూల భల్లూకవాసమ
హాటవీవిటపిసమావృతంబు
సన్నుతసత్కీర్తి సంయుతనన్నయ
ప్రగ్గడ కవివర్యభాషితంబు
ధనధాన్యరత్న నిధానసంసూచనా
ప్రాసాదరాజవిభాసితంబు
కోటిలింగక్షేత్ర గోపురశోభిత
పూతగోదావరీ భూషితంబు

తే. ధరనునలరు రాజమహేంద్రపురవరంబు
అందు బ్రాహ్మణపాండిత్య మగ్గలంబు
రాజభుజబల మెవ్వేళఁ బ్రకటితంబు
వైశ్యభాగ్యంబు సత్కార్యభాజనంబు" 2

చ. „అదె! యలతాళపాదపశిఖాంతరమందున ధూమధూమళులన్
జడలను నింపనంపుచుఁ బ్రశస్తరుచిన్ దనరారుచుండె న
య్యదె కద తత్పురంబహహా!” „ఔనన్న! దానినెయేలు [చుండె స
మ్ముదమునఁ బూర్వమొక్కపుడు భూపతి రాజనరేంద్ర [రాజనన్. 3.

తే. ఆమహారాజునకును రత్నాంగియందుఁ
బ్రభవమొందెను సుతుఁడు సారంగధరుఁడు;
దినదినముతండు వృద్ధినిఁ దనరఁదొడఁగెఁ
గరముసితపక్ష సారంగధరునికరణి.” 4

చ. „అగునగుఁ గోటగుమ్మమని యౌసతి మేడని కందకంబటం
చొగిఁబలుకంగ విందుము జనోక్తులనెన్నియొ” „నిక్కవం [బు కా
నగనగువానినిన్ బురవనంబునకున్ మునుముందు, నిప్పు డా
సొగసగుకట్టడంబులును స్రుక్కి వినాశనమొందియుండెడున్.

ఆ. మొగ్గ విడిచి యల్లపూవగు పోలిక
నతని శైశవంబు యౌవనమును
బొందె నంత మోదమొందుచు భూపతి
తనయునకును బెండ్లిఁ దలఁచె నెడఁద.

చ. తలఁచినయట్టి యప్పుడొక తన్విపటంబరు దెంచెఁగాని యా
చెలిచెలువంబుఁ జూచి తనచిత్తము భ్రాంతి పడంగఁ
[బుత్రికిన్"
"దలపక తానె కట్టుకొనెఁ" "దత్తరుణీమణి జవ్వనంబునన్
జెలఁగుచు నుండఁబోలుఁ దమిసేవలఁ జేసెనె వృద్ధభర్త
[కున్?"

మ. "పరవంశంబునజన్మమందుటను భావంబందునన్ జంకుచున్
నరనాథున్ దనియించుచుండె, నయినన్ నారీమణీమానసం
బరయన్ జక్కని రాకుమారుపయి మోహంబంది యాం
[డెంజుమా•
తరి యే నాఁడని చూచుచున్ సతతమత్యంతంబుఁ జింతిం
[చుచున్.

కం. ఇప్పగిదిఁ గొంతకాలం
బొప్పుగఁ గడవంగఁ గల్గె నూర్మికిఁ జుట్టున్
ముప్పులు వన్యమృగంబులఁ
దప్పక వేటాడవలసె ధరణీపతియున్.

కం. అప్పుడు వేటకు వెడలెను
నొప్పుల చిత్రాంగి యొసఁగె నుత్తరము పతిన్
దప్పక వడి రండనుచును
జెప్పఁగలేదు సతిపేరు చిత్రాంగి సఖా!

ఉ. ఈ దినమందు రాసుతుని నేఁగననొనని కుల్కుచున్ మనో
వేదనఁ బొందసాగెనలబిత్తరి, యాయుపరాహ్ణమందునన్
మోదముతో నతండొక కపోతమునుంగొని యాటలాడు

[చున్

వే దివిముట్టఁ బోవిడిచె విస్మయమెచ్చఁగ జూచువారికిన్.

కం. సొగసుగ నాపారవత
మెగురుచుఁ జిత్రాంగి మేడ నే వ్రాలెను నా
నగలాడి పట్టుకొనియెను
నగమహా! చేరూరెననెడు సంభ్రమ మెసఁగన్.,,

కం. ,,ఇది యొకనిదర్శనంబగు
మదనుఁడు తన యాశ్రితులకు మఱవక యాయా
యదనుల నెప్పుగఁ గూర్చెడుఁ
గద! నడుమఁబలికితి ననక కథ నిఁకఁ జెపుమా!,,

కం. ,,పావుర మచ్చోట వ్రాలెను
దేవల దాయనుచుఁ దలచి తిన్నగ నేత
ద్భూవరవరనందనుఁ డల
భూవరసతిమేడ పఱికిఁ బోయె రయమునన్.,,

కం. ,,ఆవనిత మేడయనుచో
నావంతేన పక్కుఁ గోఱలు నలసౌధమెకా,,

,,కావచ్చును నేమననా
తావల సౌధంబునకును దగు ననవచ్చున్.

కం. ఆసరి కెరవియుఁ గుల్గొంకెడు
నాసలు జారులకును హృదయంబులఁ బొడమున్,,
,,ఆ సంధ్యారాగో దయ
మీ సాయంతన మల్లె యొనరెనేమో కనఁగన్.,,

చ. ,,తనకుఁ గుమారుఁ డెట్లగును దథ్యము మారుఁడటంచు నెం [చుచున్
వనితయు సాదరంబుగను వానినెదుర్కొని పక్షియన్న ని
త్తును పరులెల్ల నీవటులఁ దోఁదఁ జెందెదవేల యంచు [దాఁ
గనుఁ బలుపంగఁ జొచ్చెఁ దన కాపురమున్ బడకింటి తా [వులన్.

కం. ఎంతకు సారంగధరుని
స్వాంతము మఱియొక సరణిని నగపడకునికిన్
సాంతంబుగఁ దన పెండ్లియు
దంతంబునుఁ దెల్పె నపుడు తమి యుప్పతిలన్.

చ. తుదకిఁక నెమ్మదిన్ బొడము దుష్టతలంపు నడంపలేక త
త్పదములవర్తనుండయిన క్ష్మాపతినందనుతోడఁ బల్కె ,నా

హృదయమునీదురూపమున నెంతొ విరాళిని జెందివేగెడున్
సదయత నాదుజన్మమును సార్థకమందనొనర్పఁగానగున్.,,

తే. ,,నావివరుసలు తలపఁగరావుసూవె!
మంచి చెడుగని యించుక నెంచరుకద!
కాముకులు వారిమనములఁ గాముకుండ
ఖండముగఁ దాండవంబాడుచుండునెడల,. 20.

చ. ,,తరుణివచించువాక్యములు తావిని రాజకుమారశ్రేష్ఠుఁడా
కరముల రెంటిఁ గర్ణములఁ గప్పుచునిట్టులఁబల్కెసాగెడున్
,హరహర! నీవిటుల్ నుడువనర్హమె? తల్లివినీవునాకు నే
నరయఁగనీకుఁబుత్రుఁడను న్యాయమె?లోకులువిన్నఁదిట్టరే?,

కం. పలికెడువానిన్ వినకయె
బలిమినియత్నంబొనర్పఁ బడయఁగ సతియున్.
జలియింపక యతఁడెట్లో
వెలుపలఁబడి గృహమునకును వెడలెనుచింతన్ ,, 22

చ. ,,అది పెఱవారికిన్ దెలుప నాయువనీపతినందనుండు తా
నెదఁ దలపంగలేదుకద యెంతటిధీరుఁడొ శాంతచిత్తుఁడో''
,,యదితనుచాటు నేనిఁ దనయయ్యనునమ్మను నన్వయంబు
[నున్
భొద లెడుదుర్యశంబనుచుఁబూజ్యుడతండుగ్రహింపకుండునే?

ఉ. అంతటనామృగాక్షి తనయాసలు వ్యర్థములౌట నీసునన్
జింతనసేసి వీనికురుశిక్షవిధింపగఁ నౌనటంచు నే
గంతనొ యొక్కమూలఁగడుఁగాసిలినట్టులఁబండె నంతలోఁ
గాంతనుఁజూడరాజు తమకంబునవచ్చెను వేటపాటునన్

కం. వచ్చినఁ దనుఁగనకయె యు
మ్మచ్చునఁ జెలియుంటఁజూచి మదినాశ్చర్యం
బెచ్చగ నుదయింపంగను
జెచ్చెఱదరిఁ జేరి యడిగె క్షితిపతి మమతన్. 25.

సీ. మగునికటారివై మరులిగుర్కొల్పించు
వనితరో! నీవిట్లు వనరనేల?
చంద్రికాహాసవై సంతోషమును జిల్క
చానరో! నీవునన్ గానవేల?
మానినీ తిలకవై మహిమొప్పు మానిని!
యవమానవతివగు చడలనేల?
శృంగారవతివయి రంగారు చిత్రాంగి!
శిలుగొంది నీవు చింతిలఁగనేల?,

తే. అనిన యొకింత బెట్టుగ నల్ల లేచి
యధిప! నీయానఁ జెపుదు దుర్విధిని వినినఁ
జెప్పఁగా నేమిఫలమని, చెప్పలేక
చెప్పినట్లుగఁ జెప్పె దుశ్శీల యిట్లు. 26

తే. ‘నాకుమారుఁడై నన్నుఁ జీకాకుపఱిచెఁ
గట్టి! సారంగధరుఁడు నా చేట్టపట్టె
మత్త యువరాజు నన్నవమాన పఱచె
బలిమి ముద్దులపట్టి చన్బరిభవించె’

చ. అదివిని రాజు డెందమున నచ్చెరు వాత్రము రోషమున్
[బయిం
బొదువఁగ నట్టె కొయ్యయయిపోవుచుమిన్కక నిల్చెనంతట
మ్మదెవతి యేడ్వసాగె,, ‘‘నవమానమునుంభరియించుటెట్టులీ
సుదతులు జిత్తులన్నియును సూక్ష్మముగాఁ గనఁబన్ను వా
[రు జూ,,

ఉ. ‘‘ఓనరనాధ! నాధ! వినుమో నగరేశ్వర! యిట్లుచూడుమా
మానధనాగ్రగణ్య! యఁలమాటలు నోటనరాక యుండెనా
మానసమెల్ల యిప్పుడవమానదవాగ్నివిదగ్ధ యయ్యె డో
హో! నయశాస్త్రవేత్త! తనయుండొనరించెను మాన
[హానినన్

తే. అను చినుమడించి పలికెను నన్యపాప
మించుకెఱుఁగని యావృద్ధనృపతి వడఁక
నృపతియు మఱేమి సేయంగ నేర్చువాఁడు
తల్లిమానంబుఁ జెఱిచిన తనయుఁగూర్చి 30

శా. 'ఏమేమీ మా మృగయార్థమై యటవి కేనేగంగఁ దాఁ గాంచి దు
ష్కామోన్మత్తతఁ జేసెనే యిటుల ఛీ! ఖండించెదన్ వా
[నినం'
చేమాత్రంబు విచారముఁ సలుపకే హింసించె సత్పుత్రు
[నిఁ
సోమాస్యుఁ బరనీతివర్తనునినప్రోత్ప్రభాభానునిన్.

కం. ఈతావునం దెసుమ్మా
భూతలనాయకసుతుండు పొందెను శిక్షన్.
చూతమటంటివ యేనీ
ఆతిన్ దక్షండనమిటఁ బ్రకటితమయెడిన్. 32

కం. కానీ సత్యము డాగునె?
మానిని యొనరించినట్టి మర్మంబెల్లన్
భూనాథునకును దెలిసెను
నానాటియుఁ బొందె నంత్యమతి ఘోరముగన్. 33.

తే. ఉప్పుపాతఱ నడఁగెను నప్పుడంతి
యిప్పటికిఁ గూడ నయ్యది యెఱుఁగఁ బఱతు
రల్లసాతేరుగ్రామమునందుజనులు
ఆయినోకదానిఁ జూపి చిత్రాంగి యనుచు,, 34

## ఉత్సాహము.

„ఇఁకనుమనము గృహమునకును నేగుదమిదె లెమ్ము వే ,
సుకరముగను జెప్పితీవు చూచినట్లి యాకథన్”
„సుకరముగను జెప్పి తీవుచూచినట్లటంచు న
న్నొకసకియములాడుచుంటివేమొ మిత్రరత్నమా ! 35

ఉ. కూలెడుమంటిగోడ దిగఁ గ్రుంగెడుకప్పునఁ దాటియాకులన్,
గాలికిఁ బుచ్చి ప్రాతగిలికప్పుచున్న కుటీరమద్ది ది
వ్యాలయమై తమంతగు కుజావళిమాషుడిజీడిమామిడిన్
మేలగు చీనమున్నతపుమెట్టను నీకథఁదెచ్చె జ్ఞప్తికిన్.„ 36

---

# XVIII తీవ

ఉ. ముద్దులచిన్నితీవ! నిను ముచ్చట నెచ్చటొ కాంచి, [తెచ్చి నా
యొద్ద నమర్చి పెంచి కర మొప్పఁగఁ బందిరినల్లి, వేడ్క నే
ప్రొద్దును బ్రాకుదానవని పూచెడుదానవటంచుఁ గుల్కఁగా
నెద్దియొ పెల్లగించినిను నీక్షణ మందున రూపుమాపెఁగా

సీ. లేయెండ నీపైనిఁ గాయ నోర్చితి కాని
ముదురెండ కాయ మార్గ్నము వెడితే!
చల్లని చినుకుల చవులఁ దేలితి కాని
జడివాన కొట్టఁ జంచలతఁ గంటె!
పిల్లవాయువులలో నుల్లసిల్లితి కాని
విసరి వీచిన నెంతొ బెదరునుంటె!
కొనవ్రేళ్ల సవరించఁ బెనఁగుచొప్పితి కాని
మోటుతాకిన దిగుల్పాటు పడితె!
నవకముల్ ప్రోవ! లేఁదీవ! యవయకుండ
దినదినాభివృద్ధినిఁ గని త్రుటిని నాకుఁ
దెలుపకుండఁగ నెడఁబాసితే యొకింత
సొగసు చెలువమ్ము జాడయు మిగులనీక!

ఉ. నీమృదులంపుఁగ్రొంజివురు, నీరమణీయపుఁజాయ, యల్ల నీ
కోమలరాగపుంగలుపుకోలుతనంబొకకొన్నినాళ్లయున్
నామనమందునాటుకొని నన్ను విడంగనుజాలకున్న వో!
కామితవల్లరీమణిరో! కంటికిఁ గట్టినయట్టులుండువే. 3

---

## xix జన్మస్థానసంస్మృతి.

---

చంపకమాల.

స్మరణకువచ్చుచుండె మన చక్కనిగ్రామము కొండలన్ [గనన్,
నరహరి కీర్తికాంతులను నల్లడలన్ ధవళాగ్ర మెంతయున్
బరువుచునుండెఁ, బాండవుల పర్వతపంక్తిని జూడు దాని ద
గ్గరవిలసిల్లు నా చెఱువుగట్టున హాయిగఁ జల్లగాలికిఁ
దిరుగుచునుండ మే, మఱియుఁ దీయని మామిడితోఁటకా [వలన్
గరువునకేగి యుల్లమునగాలగిరుల్ వడినెక్కుచుండ మే,
యరయమె యింక నుత్తరమునందున నొప్పెడు కొండ [లల్ల వే
వరుసగ నీలమేఘము నభంబునకంటెడు పోల్కి లేచెడున్ ;

గరమునమీపమందుననె కన్పడుచున్నవి నిబ్బరంబుగా
సరగున నేగుచో మనముసంజకుపూర్వమె చేరమాయనన్.

———

## XX పరిత్యక్షము.

---

ఆ. ,,అనుదినంబు నీదునందను మలయుచు
నుండువాఁడ నాకు నుదధి! యొక్క-
పరి భవత్స్వరూప ప్రత్యక్ష మొనఁగూర్చు
తొల్లి రామునకును దోఁచినట్లు." 1

తే. అనుచు నే నొకలలితదినాంతమందు
జలధితీరవిహారమున్ సలుపుచుండి,
వెలయువారిధిఁగూరిచి విన్నవింప
దానివిని వార్థియిట్టు లుత్తర మొసఁగె. 2

తే. ,,అల్ల రాముఁడు క్రుద్ధుఁడై యమ్ముఁబన్ని
విడుతునంచును నామదిబెగడుఁ గొలిపె
నీవు చేసెడిదేమొ నాకెఱుఁగ పఱతు
వేని జూపించువాఁడ నాయెసఁగు రూపు." 3

తే. దాని విని నే వచించితి ,,నేను నిన్ను
నిష్ఠురములాడి నొప్పింప నేర్తు, నీదు

రూప మిప్పుడు నాకిటుఁ జూపకున్న
నెఱుఁగవా? నేను చిన్నప్డె యెఱుఁగువాఁడ."

కం. "తనువున విఱిగిన యమ్ములు
ననువునఁ బుచ్చంగ వచ్చు నతినిష్ఠురతన్
మనమున నాటిన మాటలు
వినుమెన్ని యుపాయములను వెడలునె" యనుచున్

సీ. ఈశ్వరుండు కుడువ నిడితివి బడబాగ్ని
నాపని ఘోరమౌ పాపమందుఁ
జందురుఁ డేరీతి జరగింప జరగుదు
నీకుమారున కీవు లోకునందు
నంబరచ్ఛాయల బింబించు చుందువు
నీ వరములు నీవి కా వటంచు
భూమిని సతతంబు మోదుకొందువు నీదు
వర్తనం బంతయు భంగమందు

గీ. జలధి! నీ జలం బుప్పకషం బటందు
నీవు చేపకు మొసలికి నిలయ మందు
నెసఁగు నీప్రక్క నుత్త గండ్రను కటందు
ననుచు బెదరించితిని దాని కడలి యేమొ. ౮

సీ. బెళుకు చేపలఁ బోని తళుకు లీనుచు నున్న
చూపుల నివ్వాళిఁ జూపువారు

తాబేటిచిప్పలు నాఁ బోలు చుండెడు
మోకాళ్ళపైఁ బడి మ్రొక్కువారు
శైవాలమునకును సరివచ్చు కురుల నొ
ప్పారు శిరమ్ముల వంచువారు
అనిలంపు మ్రోతల కెనవచ్చు చుండెడు
స్వరములభజనంబు సలుపువారు.
తే. అంబరస్పర్శచేఁ గల్గె ననఁగనొప్పు
నడుముకోడ విధేయతల్ నడుపువార
లెంద తెందఱో చుట్టు నమందగతుల
నేగుదెంచుచు సేవల నిడుచు నుండ.

సీ హేమనైర్మల్యంబు లమలంపుమోమునఁ
బోలుపాఱఁ బొంగుప్రపూతగంగ
పెద్దవజ్రపుఁగాంతి నిద్దంపుఁజెక్కిళ్ల
మెఱయుచ స్వేదు గౌతమీసఘురంబు
ఘనవేణిమురిపెంబు లనువైనకటిపైని
నసియాడ నరుదెంచు నల్లకృష్ణ
చుఱుకైననడకలు వరపదమ్ములమ్రోయఁ
బింపిళ్లు గూయుకావేరియేరు
తే. చిత్రగతులను జూపుచుఁ జెలు వెలర్ప
నేగుదెంచు తక్కఁగలనదీగణమ్ము

రంగ దంచితశృంగారరసము లొలుక
సరసఁ దగఁజేరి తగుపరిచర్య సలుప.

సీ. కనులబండువ సేయుఘనదేహరుచితోడ
గంభీరమగుశంఖగళముతోడ
చెలఁగుగాలి కెగురుచేలపింజెముతోడ
రహినాడురత్నహారంబుతోడ
జగతి కదృష్టమై నెగడుడెందముతోడ
నురుభారమూను పేరురముతోడ
రవణించుడిండీరధవళహాసముతోడ
విలసిల్లు పవడంపుఁబెదవితోడ

తే కనదపూర్వపూరుషరూపమును ధరించి
స్వీయహస్తముల్ ముత్తెపుచిప్ప లట్లు
మోడ్చి నమ్రీభావమ్ములు పొదల నాదు
మ్రోలఁ బ్రత్యక్ష మయ్యె సముద్ర మహాహ !

తే. వాని కనునంత నాకొక్క వరుస మదిని
విస్మయము భక్తి సంతృప్తి వేడ్క లమరఁ
బలుకసాగితి నీలాఁగుఁ బలుకఁ దగదొ
మనలముందు వినమ్రము లై ఘనులు నిలువ. ?

సీ. ధవళచంద్రునివేల్పుకవణంబు గాఁజేసి
యాపునురగలతోడఁ దృప్తికంటి
తీయనియమృతంబు దివిజులకర్పించి
యాపుష్పతోడను నెనఁగుచుంటి

ఐరావతోచ్చైశ్శ్రవాదు లింద్రున కిచ్చి
యీవు చేపలతోడ నింపుఁగంటి
కౌస్తుభలక్ష్ములఁ గమలాక్షునకు నంపి
నీవు నత్తలతోడ నెగడుచుంటి

తే. విపుడు నీఘనత్వంబు నా కిచ్చి యిట్లు
నీవు నమ్రతతో ముందు నిల్చియుంటి
వౌర! నిను గొనియాడంగ నగునె నాకు
ననుచు గనులు మొగిడ్చి సాష్టాంగపడితి

కం. పడి లేచి చూడ నప్పురు
షుఁడు మాయం బయె ; నెదఁ జోద్యము మిగులన్
బొడముఁగ నచ్చోటను బడఁ
బడి కనుఁగొనఁగలిగినాఁడ వార్ధివ్యాప్తిన్ 12

చ లలితవినీలకాంతులు తలంబున
బింబిత మౌచునుండఁగా
జలములు గాలికిన్ జెదరి చల్లనిబిందువు లై
స్పృశింపఁగా
నల లొగిఁ జుట్టి వచ్చుచు రయమ్మునఁ దీరముఁ
దాకి మ్రోయఁగా
నలఘుసముద్రమయ్యె మఱి నాతఁ డహా! యని
లోన నెంచితిన్. 13.

---

# xxi చిన్నిలోకమా!

---

ఉత్సాహము.

అచ్చెరువుగ నాకసమున నర్బుదాలు నిర్బుదాల్
రెచ్చుచుండి యుడుగణమ్ము రేయి నెల్లశాంతమున్
బుచ్చుచున్నఁ గాని, వేఁగు పొడమఁ జిన్నిలోకమా!
తెచ్చుకొనెద వేల చింత తెగనికలహమోదివై.?
అంతరములు కొలుపుచున్న నాత్మ ధర్మ మెంచుచున్
బంతగింప కుడుగణమ్ముపైని రాత్రి రంతయున్
గాంతిలినను గాని వేఁగు కాఁగఁ జిన్నిలోకమా!
యెంతో యీర్ష్యఁ జివికె దేల తృప్తిరహితభావివై ?
పొడుపుఁ గ్రుంకుపాటు లున్నఁ బొడిచి గ్రుంకువఱకునున్
గడఁ సహించి నిజరహస్య గాన తన్మయమ్మునం
దుడుగణమ్ము మాపునెల్ల యొక్కతీరు మింటిపై
మిడుఁగు మన్న కాని వేఁగు మాఱఁ జిన్నిలోకమా!
పడెద వేల దిగులు నీవు ప్రతిత్రుటిగ్ని రాశవై

---

# xxii అంబుదంబ!

---

గీతమాలిక

అనుజులను గూడి యొక యపరాహ్ణమందుఁ
గాపవరపుఁ దటాకపు మేపులందు
వాజులన్ బట్టుకొనుచు సవారిఁదీయు
చుండఁ గాంచితి నిన్ను దిఙ్మండలమునఁ ;
బొరలి వచ్చెడు వారిధి పోననంగ
నొక్క నిమిషమ్ములోన మే మక్కజపడ
గాలితో వ్యాప్త వైతి వాకాసమంత,
యెంతొ వర్షింతు వనఁ బోతి వంతలోనె. 2
అనఁగు వెనువెంట నొందు సాయంతనమున
జివర మునగాలకొండపై చింతకొమ్మ
నెక్కి కాయల నూపుచు నెక్కసక్కి
యములఁ బ్రొద్దును బుచ్చెడు నవసరమున ; 3
నలసిపోయిన సాంధ్యార్కు నందుకొనెడు
నపర దిక్సతి చెలువంపు హస్తయుగళి
మెఱయు చుండెడు హుంకుముంజి మెత్తలనఁగఁ

బఱుగఁ నిన్గంటెఁ గన్నులబండువుగను. 3
నిదుర లేచుచు నే నొక్క యుదయమందు
నూతనోత్పుల్ల పద్మవినోదమైన
కొలఁకునను దోనెఁ ద్రోయుచుఁ గుసుమములను
బొదువు చెడకుండఁ గోనగోటఁ బుణుకుచుండఁ; 4
బ్రొద్దిశాచలదేవళద్వారమునకు
నడ్డముగ వేయు తామ్రంపుకడ్డి యనఁగ
వెలయుచుండెడు నినుఁ జూచి తెలిపినాఁడ
గట్టుపై నున్నవారల నట్టె పిలచి. 6
జోకమగు తోఁటనొప్పెడు పాఁకలోన
నంటుమామిడిపండ్లను నాహరించి
యపుడె యేతాము త్రొక్కిన నలసియున్న
పాలికాఁపులతో వింత పలుకుచుండ; 7
నురుములను మెఱుపులను మహోగ్రవృత్తి
నిలిచి పిడుఁగుల వడగండ్లఁ గలసి యొక్క
యేకధారగఁ గురిసితి వెంతొసేపు
ప్రళయమే ముంచుకొనుచును వచ్చెననఁగ. 8
జాముప్రొద్దుండగాఁ గళాశాల విడిచి
గౌతమీతీరమందునఁ గౌతుకమునఁ
బడవలను బండ్లఁ జూచుచు నడచుచుండ:

వంతెనకుఁ బైనిఁ గనఁబడు పర్వతముల 9
మేఁత మేయంగ దిగు నాలపో తనంగ
వెల్లవన్నెలతో నీవు విశ్రమింపఁ
గాంచితిని నేను, మఱియును గాంచి వ్రాసె
మేలురంగుల పటము నా మేనమామ. 10
అల్లనీలంపుఁదలమున సందునందుఁ
బొడముచుండెడు ఫేనంబు బ్రోవుసేసి
దరికిఁ జేర్చుచునుండెడు కెరటములను
గనుచుఁ దిరుగాడు చుండఁగఁ గడలిపైనిఁ 11
గంటి ని న్నొక్కవేళ విఖ్యాతమైన
యింద్రధనువును దాల్చి యొసఁగుచుండ;
దూర్పు నుత్తర దక్షిణ ధ్రువములందుఁ
గలుప రంగులవంపును నిలిపి తనఁగఁ. 12
జదువుకొనుచును నే నున్న గదికి ముందు
నల్లుకొను సన్నజాజులవల్లిఁ జూచి
నడుమ నడుమను సమ్మోదపడుచు నుండ
నొక్క వాసర మెల్ల నీ వొక్కతీరు 13
గట్టి యాకసమునఁ జిల్లుపుట్టె ననఁగ
ముసురు కల్గించితివి కడు విసుకు పుట్ట.
మఱియు నీరేయి మేడపై మలయ పవన

లలితపోతమ్ములకు సంతసిలుచు మేము 14
ముచ్చటించుచు నుండంగ వచ్చి యహహా!
యెంచికట్టిన సంచిని నుంచు రీతి
దాచుచుంటివి చంద్రుని తఱుము చుండి.
యెంత మేలైన నీ వాక్యమింతు వెట్టి 15
వన్నెల నయినఁ జూపింతు వెన్న నేల?
అంబుదంబ! ఆ రవిశశిబింబశోభి
తాంబరంబెల్ల రాజమార్గంబు నీకు!

—:o:—

# xxiii ధ్రువబుద్ధి

———

ఉ. తల్లిరో! యెట్టులుల్లమునఁ దల్లడమందుచు, లేఁగ [దూఁడపో
గొల్లఁడువెట్టియై నెమకు కూరిమిఁ జూపుచు వన్యభూ [ములం
దెల్లెడఁ గాళ్లతో ట్యినడ నేటికిఁ ద్రిమ్మరుచుంటివమ్మ! నీ
పిల్లఁడు తప్పిపోయెనొకొ! పెంచిన నీ హృదయంబు [నొవ్వఁగన్ 1

చ. అగునని చెప్పలేక యతివా! చెఱఁగశ్రుల నొత్తి
[గొంతులో
బొంగులుచు గద్గదంపడఁగఁ బోవుచునుంటివ నీదుత్రోవ నా
కొంగిమఱువల్కకుండగనె యొంటిగ నెంములకేగెదమ్మ! పూ
ర్తిగ నెఱిఁగించువాఁడ నొకతెన్నున నాతనిఁజూచివచ్చితిన్.

చ. దిటముగనూడలన్ భువికి డింపి సుదీర్ఘపుశాఖరాజి ది
క్తటములఁజాపి దట్టముగఁ గప్పెడునాకుల చల్లగాలినం
తట వెదజల్లి పక్షికలనాదమనోహరశాఖ్యరాజిఁ బ్రా
కటమయియొప్పు ప్రాగ్వటపుగాఁటపు నీడలచల్వపట్టులన్

ఉ. కావిడుకూలపుంగొన వికాసముపాదుకనాఁడ దంబుజిన్
దీవెలు వేళ్ళమీఁటి యొకతీయని సుశ్రుతి మేళవించి స
ద్భావనలుప్పతిల్లగను పాడెడు మానివరేణ్యు సన్నిధిన్
భావనశీలు నీసుతుని బాలునిఁ గంటిని వీనులొగ్గగన్. 4.

మ. ఉపదేశంబును భక్తిపూర్వకముగా నుత్సాహియై బాల
[కుం
డు పఠింపంగను బూనియుంట నతనిన్ లోలుండనై యేటికీ
యుపహాసాస్పదమౌ విరక్తి కడుఁబాల్యంబందె చేకొందువం
చు, పరీక్షింపఁగనైతి నీతనయుఁడా? చూడంగనౌనమ్మరో!

ఉ. అక్కడె యింకనుందురొకొ యెక్కడనుండి మఱొండు
[చాయలన్

ద్రోణిక్కి చరిత్రో? చూడ్కులకుఁ దోప రేయి చొప్పటుఁ బాసి [యుండు రే
పక్కకుఁ బోయిరో పరిసరంపుపథంబులనున్న వారితో
నిక్కమొకింగి నేర్వదగు నిశ్చలచిత్తుని నీదుపుత్రకున్ 6.

సీ. చిగురుటాకులగుజ్జు జిగి కెంపు చెదరించు
కోయిలకూతలఁ గొసరుఁ బంచి
మాగెడు ఫలరాజమధురంబుఁ జిలుకకీ
రంబులపలుకు నర్థము ఘటించి
లలితంపుఁ బాదరింటియలరుల వలపించు
గువ్వలకువకువన్ గూర్మి పెంచి
అల్లికగూటియుయ్యెలతీవ నూగించు
పిచ్చుకముచ్చట లెచ్చరించి

గీ. సృష్టిసంతతసౌంద్యసద్గోష్ఠిఁ దగిలి
మౌనిశేఖరుఁ డతులనిర్మలత వెలయు
నిందె విహరించు నెందమానంద మొందఁ
గానరా డిప్పుడిప్పుడె కానఁబడియు.

శా. ఆయోగీంద్రుఁడు నేత్రపర్వముగ నిత్యంబిందు వీక్షించు [చుం
డాయాచాయలు క్రొత్తశిష్యునకు నభ్యాసంబు కానంచు స

త్వాయత్తాత్మకు నీదుపుత్రికుని గాంతారంబునఁ ద్రి
[ప్పన
ట్లోయమ్మా! స్ఫురియించు నెమ్మదికి నాలోకింతముప్పట్టు
[లఁ.

మ. అటుపో! యల్లపాలాపు రేవడిని జోడై యొప్పు రెండెడ్ల నా
గటికిఁ గట్టికృషీవలుండొకఁడు చెక్కన్ గున్ని చేన్ జల్లి పం
డఁటయెన్నండని రేల్ బవల్ పలుకఁ దోడఁ లేక కాపుండున
చ్చోటకున్ బోయి కనుంగొనఁ దొరకు నీసూనుండు
[యోగీశుతోఁ 9

ఆ. „తండ్రితనకు నేను తనయుండనను ప్రేమ
ననుభవింపఁబోలము నప్పగించెఁ
బొద్దు సంజ నాఁడు బొమమఁడి చెమటూర
కాలమానములను గణనఁ జేసి

ఆ. దున్నిగింజజల్లి కన్నడ సేయక
కాచుకొనుచు వానఁజూచుకొనుచు
పండుపంటఁ బొట్టనిండించుకొనుచుఁను
నిన్ని యేండ్లనుండి యుండెయుంటి. 11.

ఆ. ఒడలిపాటవమున కోపికసమకూర్చి
పడెడు వానవాలు పడుపు నెఱిఁగి

కృషినిజేసికొన్నఁ గీడేలకలుగునో
యనెడుసూత్రమును ధృఢాత్మఁదలతు. " 12

చం. అనియెడు వాని పల్కులను నమ్మరొ! నీవు వినంగ [నేరవా
ఘనమగు నమ్మునీంద్రుఁ డలకాపును బ్రశ్నము వేసి [చెప్పమం
చన బదులాడుచుండెను సుమా ? త్వర పోదము వారి [జూడఁగన్
వినఁగను నాకు నెమ్మదిని వేడుక పుట్టెడువింత హెచ్చెడున్.

తే. అయ్యో ? యిప్పుడే హాళికు నరసి యట్లె
యుత్తరపు దిక్కుగా నేగియుందు రంచుఁ
జాటుచున్నవి చిన్నెలు బాట పొడవు
వారి నీనాఁడు చూడక వదల వలదు. 14.

చ. కనుఁగొను మల్లవాఁగున నొకానొక తెప్పనుగట్టిపల్లె జ
వ్వని యొక తెప్పడుం దరికివచ్చుచుఁబోయెడువారలెల్ల దా
టను గడఁబూని పూనికనడాడుచు నుండును నా పెయొద్దకున్
ముని పలుమాఱుఁబోయి కడు ముచ్చటలాడుటఁగంటి చూ [తమా. 16.

ఉత్సాహము.

„కొండకాల్వ! యెంత నీవు గొప్పదాట్లు వైచినన్

దండ నాదుగడను నిల్పి తగినతీరు నడుపువాఁ
నుండకున్న యిట్టు నటుల నూఁగు నే యటంచు ను
ద్దండవృత్తి నడుపు దాన దరికి దరికిఁ బడవలన్. 16
దాటఁగోర్కె కలిగి యొడ్డుదాపునకును వచ్చుచున్
బాటవమున జాలువాఱువాఁగునకును బెదర కీ
నాటివఱకు వచ్చినట్టి నరుల జంతుజాలమున్
దాటునట్లు చేసియుంటి దాన ముదమునొందుచున్. 17
తనకు లాభ ముండకున్న ధరను నన్యులుపకృతిన్
మనలనుండి కోరుచున్న మానక యొనగూర్ప నే
ననెడుసూత్రి మెదఁదలంచి యంబుల మానుఁగంగ నా
జనుల నీఁది పైకిఁ దీసి సలుపుడుః ఒరిచర్యలన్' 18.

గీ. అనెడు నల్లమానిని వాక్కు నాలకించు
మమ్మునెందుఁడు నీసుతుఁ డది యెఱుంగఁ
డెలియఁ జెప్పంగఁ జేయు నాలల్లన సేత
రమ్మ యిచ్చుట కెంతో దూరమ్ము లేదు.

తే. అక్కటా! యాదరి నావ నదిగో! దాటి
సాగుచున్నార లప్పుడే; యేగిచూత
మల్లపడవ యూవ్రక్కకు మళ్ళిరాగ
యెక్కిపోదము జననిరో! యక్కజమగు. 20

మ. కనుచూపున్ గొసరించి కానఁబడు నాఖండంబునం దొ
[ప్పు ప
చ్చనిమేపున్ బశువుల్ దినాంతమున కిచ్ఛన్ మేయుచుం
[డంగ శ్రీ
ద్ధను గాపాడుచు వేణునాదతతి సంధాన ప్రతిధ్వానమున్
దనివిన్ జెందెడు గోపబాలకుల చెంతన్ జూడఁగన్పించరే."

మత్తకోకిల.

"గొఱ్ఱెలన్ మఱి మేఁకలన్ మఱి గోవులన్ మఱి గిత్తలన్
వెఱ్ఱిగొల్లల మాచు నిట్టుల వెంటఁదోలుక వచ్చుచున్
గఱ్ఱికంపలఁ గొట్టుకొంచును గంజికూడు భుజించుచున్
బఱ్ఱిపచ్చికలందు ద్రిమ్మఱు వార మెంతయుఁ దృప్తితోన్
ఒక్కటొక్కటిగాఁ జరించుచు నూహనేర్వని యీపశున్
జక్క నొక్కటిగా నొనర్చుచు సాకుచుంట నిధానమై
మక్కువన్ గడుజాగరూకత మానసంబుల నిల్పి చీ
చక్కిలోఁ దిరుగాడఁజేసెడు సర్వదా మునిపుంగవా!"

కం. అని ప్రత్యుత్తర మిడు భా
షణములు వినఁబడెడు నవిగొ స్పష్టములగుచున్
గనుగొనఁగ బోదుమేనియుఁ
గనబడుదురొ కానబడరొ కనుగొనఁగనెడున్.

తే. అకట! లేరిందుఁ గూడ నిరాశయయ్యె
మఱలి పోదమటందువా? మాత! మైన!

యేమొ కనుగొంద మాకొండ నెక్కి కొంత
మేమి యచ్చోట నెవ్వరో మెలఁగుచుండిరి.

ఉ. కోయలుకొండవా రచటఁ గొందఱు కాపురముండి కొండకున్
సాయము లేక వచ్చి పథిసత్యము తప్పి విచారమందు వా
రేయెడఁ గానుపించినను నిక్కడమార్గమటంచుఁ జెప్పియా
ప్యాయము మీఱఁ బండ్లనిడి యాఁపుచునుందురు వారిపట్లి
[కుఁ

ద్విరదగతిరగడ.

"పుట్టినప్పటినుండి భూధరభూమి
మెట్టి దిట్టల మగుచు మే దినిగామి
తార్థంబులవి యెల్ల యందియుండిన ముచ్చ
స్వార్థ మెంచక స్వేచ్ఛ సంచారములఁ బుచ్చు
చుందుమే యెల్లప్పు డోఁన గూడునట్టి
విందౌన రేడు పండ్లవింత ధాన్యముఁ గొట్టి
క్షుత్తు తీఱెడు తీరుగొనుచు మేమిచ్చోట
నెత్తైనగిరు లెక్కియుండుఁ జిక్కని బాట
దారితప్పినజనుల దారి తిన్నగఁ దీసి
వారికాతిథ్యంబు పచరించుచును వాసిఁ
గాలమున్ గడపుటే ఘనముంచు మది నెంచి
యేలఁ బ్రశ్నించెదో యీరీతి మముఁ గొంచి?"

చం. అన మునివాక్యదుత్తరములొ జనులాడెడు పల్కులెల్ల ఘ
మ్మనగిరిగహ్వరమ్ములను మ్రోసెడు వేఁబ్రతిశబ్దమీనుచిం
కను తెలియంగ నేరము? కనందగు నీచటినంటి యెక్కుచో
వినబడువారిభాషణము వెంటనె నెమ్మదినోర్పుతాల్చుచో 30

మ. అకటా? యెక్కఁగ నేర మిప్పటికె యాయాసంబు [మెండయ్యె న
య్యకలంకుండగుమౌని బాలకునితో సత్యున్నతంబైన కొం
డకొసన్ వేగమ యెట్టులెక్కనొకొ చూడంబోలు నావారలీ
సకలక్షోణివిలోకనాద్భుతమునన్ సంతుష్టులై యుందురే॥

కం. మనమింక నెక్క నేరము
కనుగొలఁకుల జాఱుబాష్పకణములు పోవన్
వినవచ్చు వారిపలుకుల
వినవమ్మా! యుండెయుండి విమలత నివ్వన్

ఉ. బాలక! యింతవట్టునకు వచ్చిన మార్గమునందుఁ జూపునా
లీలలు సంగ్రహించితివొ లేదొ యెఱుంగ దలంచుచుంటి నీ
శీలము స్పష్టమౌకరణిఁ జెప్పుము, కాంచుచు విన్నవాఁడవా
హాళికుఁ బల్లెజవ్వనిని నావయి గొల్లల కోయవారలన్?

సీ. నుదుటఁ జెమ్మటచిమ్మ నుదయాస్తమయములు
హలము చేపట్టెడు హాళికుండు
దండలు గడిఁ దేఱి నిండు జలంబులఁ
బడవనుగడ వేయు పల్లెపడఁతి,

కాళ్లు కాయలుఁ గాయ కాననభూములఁ
గోగణంబులఁ గాయు గోపకుండు
గొంతు బొంగురు వోవ గుహ లంటి గిరు లంటి
విగతమార్గస్థులఁ బిలచుకోయుఁ 35
పెడఁదలం దొక్కయుద్దేశ్య మినుమడించి
మేఱ యయ్యది తనకనుమితి నెఱింగి
తృప్తి వడి నిచ్చ ముదములఁ దేలుచుండు
రట్లు జీవింప నేర్తు రే యందఱవని.? 35

చం. కనుగొను మద్రి కీపెకను గాంచిన దాఁకనొకే [విధంబుగన్
ఘనఘనగాఢనీలపరికల్పితవర్ణము, మారుతప్రతి
స్వనము తరంగతాడితవిచంచలఫేనము మీఱనూఁగుని
వ్వననిధిపైఁ బ్రియాణము లగువారల నెల్లఱ నాడు [బాలకా! 36

ఉ. వారికి నొక్కత్రోవ కనుపట్టదు వాయువు లెట్లు వీవ, నా
దారినిఁ బట్టి సాగెదరు; దండిఁ జెలంగెడుభంగఘట్టనన్
గోరినవాని వీడుదురు; కొండొకమాత్రము తళ్కులీనుచో
బోరన నందఱాదరికిఁ బోయిమునింగెడువారు పోరనన్ 37

ఉ. ఏకమతంబు లేక మది నింద్రియవాంఛలఁ బాచి వాచి, ని
త్యాకులు లై యమర్త్యపరిహాసపుఁబాత్రుల రై చిరా
[యువ్రన్
జేకురుపూర్ణసౌఖ్యములఁ జెందఁగ నేరక మాచుచుండఁగా
నేకడ నో విషాదమున నీల్గెడువారలు నిర్మలాత్ముఁడా! 38

ఉ. నీ వొకపిన్నపాపఁడవు నిష్కలుషాత్ముఁడ వట్టినీవు నా
త్రోవను నొక్కదాని కనుదోయికెనిబ్బరమంచు నెంచి లో
భావనఁ జేసికొన్న మనవచ్చును నిత్యము, నీదుకాంతి యే
త్రోవనుజూపుఁ దజ్జలధిరోదన వేదనఁ బొందువారికిన్ 39

మ. భవదీయధ్రువబుద్ధి యీగిరిపయిన్ భాసిల్ల నెవ్వారు ని
న్నవలోకింపఁగఁ గోరుచుండెదరు నిన్నాదర్శనీయంబుగా
సువిచారుల్ మునిముఖ్యు లెంచెదరు దిక్చోద్యంబ వై
[యుండు నీ
కవలన్ వెల్గెడుజ్యోతి కానఁబడదే. యం దెంత యా
[సించినన్ 40

చ. అని యడె మాయమయ్యె ముని యాత్మజు తేజము పర్వ
[తాగ్రమున్
వినుతప్రకాశముల్ గొలిపి వింతగ వెల్గెషుఁగాంచుమమ్మరో!
వనరకుమమ్మ! పోద మిఁక భాసురలీలను శాశ్వతంబుగ న్
దనరెడునెల్లవారలకు తానె నిదర్శియటంచుఁ దెల్పుచున్

చ. అతనికి మిత్రు లేదు మన కందఱు కుండెను, నేలయందు ప్రా
మతి నతఁడొక్కయాశయము మన్ననఁ జేసి చెలంగువాఁ
[డు ; సం
తతమును జీవితుండు సుమ ధారుణి మానవులెల్ల వేనవేల్
సుతములఁ బూనుచున్ విఫలమానసులై నశియింతు రమ్మరో!

---

## xxiv కల

---

ఆ. బండియొకటి యింటకువచ్చె మాయూరిది
వెళ్లుచుంటి నిపుడె వెళ్లుచుంటి
ననుచు సంభ్రమమున నమ్మనమ్మతోఁ జెప్పి
పయన మైనవాఁడ బండినెక్కి. 1
ఆ. మధ్యమధ్య బండి మందంబుగాఁ బోవ
బండివాని లేపి పండుకొనకు
తోలుతోలు మనుచుఁ దొందఱ పెట్టంగఁ
జేరి నారసూరుచేరువునకు 2
కం. ఆసరికి వేఁగుజుక్కయు
భాసిల్లుచు నుదయ మండెఁ బద్మము విరిచె

గూసెడుఁ గోళ్లొకటొక్కటని
వేసెడుఁ జలిగాలి గిరుల విచ్చలవిడిగన్ 4

చ. చలియిఁకఁ దూఱునాయనుచు జంటపొరల్ కల పెద్దదుప్పటిన్
దలపయి నుండి పాదముల దాఁకను గట్టిగఁ గప్పి క్కిరుచె
ప్పాలధ్వని సేయుచున్ నడుమముల్ కలకట్టఁను నేలఁ గొట్టుచున్
బొలమునఁ గుప్పనూర్పుకొనఁబోవు కృషీవలు నొంటిఁ
[గాంచితిన్ 4

కం. కుప్పలకడఁ గాపుండెడు
నప్పాలేరులు చలికిఁక నాఁగఁగ లేఁకే
చొప్పనొ కూర్చుచు మంటల
నొప్పఁగ వేసి చలిఁ గ్రాగుచుండుటఁ గంటిన్ 5

ఉ. బండము చేతఁ బట్టుకొని పాల్పితుకంగను వెళ్లుగొల్లనిన్
బొందుగ దూఁడలన్ గదలిపోవకయుండఁగఁ బట్టుపిల్లనిన్
దొందఱజోడగోవులను దోలఁగ మేల్కొను పాలికాఁపు మా
సందునఁ బోవుటల్ కనుచు సంతసమెచ్చఁగఁ బల్కరించితిన్.

మ. అహహా యింటిని జేరితల్పుని దెబామ్మా! తీయుమా యన్న దా
నహహా హహా, యంచును లేచివచ్చి మొవకొర్కోయంచు వేఁచిసిన
న్నాహహో హహో, యంచును లోనికిం బిలిచె నేమో యుష్ణ తెల్లా
[జెడన్

రహిం దెల్లాఱెనటంచు లేచితిని సర్వంబంత మాయంబయెన్.

# XXV ఎఱుఁగరాని

ఆ॥వె. నాఁడుతోఁటలోని లేఁదీవ మృదులంపుఁ
గెంపుఁజివురుతొడుఁగు సొంపుఁ గాంచి
యేటి కిద్ది యనుచు నెంచితి మదిలోనఁ
గాని యహహా! యెఱుఁగరాని యొక్క 1
నీలమేఘమాల నిబిడంబుగా మూసి
చల్లనైన వాన యల్లఁజిలికె;
నాడు తీవ మిగుల మోదంబు నుప్పొంగి
శిరము వంచి యెత్తి కెరలి యాడె. 2
నాఁడుతోఁటలోని లేఁదీవ నును మొగ్గఁ
గులుకుచుంటఁ గాంచి తలఁచితి నది
యేటి కనుచుఁ గాని యేమని చెప్పుదు
తెలియరాని యొక్క మలయపవన 3
మల్లరేకుకంట మెల్లన వీచుచు
వలపుఁ జిమ్మ నాల్గు వైపులకును;
నాడుతీవ మిగుల మోదంబు నుప్పొంగి
పూలచామరములు లీల విసరె. 4
నాఁడుతోఁటలోనిలేఁదీవ ఫలముల

వ్రేలుచుంటఁ గాంచి యేటికంటెఁ
గాని యెఱుఁగరానికరపద్మ మొక్కఁడు
రాలఁ జేసి పీల్చె రసము లెల్ల;
నాదుతీవ మిగుల మోదంబు నుప్పొంగి
విత్తనముల నౌర వృద్ధిఁగాంచె.



1917

జూలై నెలలో

దా॰ బ్రో॰ ప్రగ్రంథము

# వివిధకుసుమావళి

## ద్వితీయగుచ్ఛము

చందాదారులకు 0 8 0

...తరులకు 0 12 0

క్రిందివారలకు దరఖాస్తు పెట్టుకొనవలయును :—

గాడిచెర్ల రామమూర్తి గారు,

రాజమండ్రి.